# ఆంధ్రమహిళ

సంపుటి 9 :: ఏప్రిల్ '53 :: సంచిక 12


| | | |
|---|---|---|
| సంపాదకీయం | ... | |
| ప్రస్తుతపరిస్థితులు | ... | శ్రీమతి అచ్యుతుని గిరిజ. |
| రాజకీయములు | ... | శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు. |
| కీర్తిశేషులు (నాటిక) | ... | ,, కందుకూరి లింగరాజు. |
| విద్యుచ్ఛక్తి విశిష్టత (విజ్ఞానము) | ... | ,, వేమరాజు భానుమూర్తి. |
| నీవు | ... | "శ్రీ శిల్పి" |
| అంతరాత్మ (కథ) | ... | "సమీర" |
| ప్రేమసమాగం (కథ) | ... | శ్రీమతి అరుణ. |
| వెలుగు నీడలు (కథ) | ... | ,, జయంతి కామేశ్వరి. |
| శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు | ... | ,, కె. యం. సౌందర్యవల్లి. |
| ఉత్తరాల ఉపద్రవం (కథ) | ... | శ్రీ కాకరమూడి సీతారామస్వామి. |
| నాదే పొరపాటు (కథ) | ... | శ్రీమతి బి. సుశీల. |


ఇంకా, గద్యాలు, పద్యాలు, బాలానందం.


వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే.,బి.యెల్.,
సంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే.,యెల్.టి.,

ఆంధ్రమహిళాసభ, మైలాపూర్.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు.


## గమనిక

ఈ విజయ సంవత్సరారంభంతో, "ఆంధ్ర మహిళ" పత్రికకు 9 సంవత్సరములు నిండి, 10 వ సంవత్సరము ప్రారంభమైనది. ఈమారు ఆంధ్రమహిళాసభ దసరా ఉత్సవాలతోపాటు "ఆంధ్ర మహిళ" 10-వ వార్షిక సంచిక ప్రకటించే ఉద్దేశముతో, వచ్చే వర్షము మే- నెలలో వెలువడే "ఆంధ్ర మహిళ" జన్మదిన సంచిక ఆపుచేయడమైనదని, రచయితలకు, చందాదారులకు, ఇతర చదువరులకు మనవి జేయుచున్నాము.

—సంపాదకురాలు.




సంపుటి 9 :: ఏప్రిల్ '53 :: సంచిక 12

# వాంఛూ నివేదిక

—:o:—

న్యాయమూర్తి వాంఛూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సందర్భములో, ఆస్తిపాస్తులు, సిబ్బంది పంపకాలను గూర్చి, హైకోర్టు, రాజధాని తాత్కాలిక స్థావరాలనుగూర్చి, భవిష్యన్నిర్మాణమునుగూర్చి, నూత్నరాష్ట్ర నిర్వహణ లోనూ, రాజధాని నిర్మాణములోనూ, కేంద్రప్రభుత్వ మొసగవలసిన తోడ్పాటునుగూర్చి, అన్నివిధాలా అందఱూ న్యాయసమ్మతమైనవని అంగీకరించవలసిన రీతులను సూచిస్తూ భారత ప్రభుత్వానికి తమ నివేదికను సమర్పించారు. జె. వి. పి. రిపోర్టు ఆధారముగా చెన్నపురిని ఆంధ్ర ప్రాంతములో జేర్చని నిబంధన ననుసరించి, మిగతా వ్యవహారములను పరిష్కరించు విధానములను సూచించుట న్యాయమూర్తి కర్తవ్యమైనది. తదనుగుణముగా, రాష్ట్ర ప్రభుత్వమువారు ఆయనకందించిన లెక్కలను, తదితరవిషయములను సమగ్రముగా పరిశీలించి, వివిధపక్షముల వారు సమర్పించిన నివేదికలను పరిశీలించి, తెలుగు జిల్లాలలో పర్యటించి, తమ విధాయకమును, ధర్మబద్ధముగా నిర్వహించెననుట నిస్సందేహము.

ఆంధ్రరాష్ట్ర విభజనోద్యమము ఈనాటిది కాదు. ఇది ఆరంభమై 40 దీర్ఘవర్షములు గడచిపోయినవి. మధ్యప్రదేశ్ గవర్నరు శ్రీ పట్టాభి సీతారామయ్యగారు వ్రాక్కుచ్చినట్లు, ఈ ఉద్యమ ప్రప్రథమ నాయకులైన దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు, దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు రాష్ట్రావతరణ చూడగల అదృష్టము లేక దివంగతులైనారు. అఖిలభారత సమస్యముందు స్వరాష్ట్ర సమస్య సంకుచితమైనదిగా భావించి, స్వాతంత్ర్య సమరములో పోరాడిన ఆంధ్ర నాయకులు తమ ఔదార్యమును చూపించినారు. స్వాతంత్ర్యసిద్ధి యనంతరము, ఆంధ్రసంస్కృతి సంరక్షణకు, ఆంధ్రప్రాంత అభివృద్ధికి, ఏకైక మార్గముకాగల ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సత్వరమే జరుగవలెనన్న నినాదాలను సర్వపక్ష ఆంధ్రనాయకులు ప్రారంభించినారు. జె. వి. పి. రిపోర్టువల్ల నాయకులకు కలిగిన ఆశాభంగముతో ఉద్యమము మరొకమారు సర్దుకున్నప్పటికీ; స్వామి సీతారాం మున్నగువారి కృషివలన పూర్తిగా నశించకుండా, శ్రీ పొట్టి శ్రీరాములుగారి ప్రాయోపవేశము, ఆత్మార్పణముల పర్యవసానంగా ఒకమారు ఉద్రిక్తరూపమును దాల్చినది. 40- సంవత్సరములు శాంతముగా ఓపికపట్టిన ఆంధ్రప్రజ, ముక్కోటి ఆంధ్రుల ప్రతినిధిగా, ఆంధ్రరాష్ట్రసిద్ధియే లక్ష్యంగా, ఒక మహావ్యక్తి ఒనర్చిన ఆత్మబలిదాన యజ్ఞమునందు భారతప్రభుత్వము అగుపరచిన అలక్ష్యమునకు తమ అసమ్మతిని జూపుటకై కొంత ఉద్రిక్త చర్యలకు గడంగినా, శ్రీరాములుగారు మరణించిన యనంతరము భారత ప్రధాని రాష్ట్రనిర్మాణమునకై సత్వరచర్యలు తీసికొనబడునని చేసిన వాగ్దానమువల్ల, తమనాయకుల ప్రబోధానుసారముగా శాంతులైరి. న్యాయమూర్తి వాంఛూ నివేదిక న్యాయబద్ధముగా నుండగలదని

ఆశిస్తూ, భారత ప్రభుత్వము ఆ నివేదిక ఆధారముగా తమకు న్యాయముచేయగలరని నమ్ముచూ, రాష్ట్రావతరణను గూర్చి కలలుగంటూ వేచియున్నారు. పటికిబెల్లం చేత పెట్టినంతనే ఏడ్పుమానిన పసివాని చందాన, రాష్ట్రనిర్మాణ వాగ్దానము చెవిని పడ్డంత మాత్రాన అతి అమాయకముగా చల్లబడినారు.

వాంఛూగారి విచారణ సమయములోనూ, తత్పూర్వమూ, తదనంతరమూకూడ, రాజధానివిషయములో ఏకీభావము కుదుర్చుకోలేదన్న ఒక ఆక్షేపణదక్క, ఆంధ్రనాయకులు, ప్రజాసామాన్యముకూడ తమ ప్రవర్తనలో గాని, ప్రసంగములలోగాని, దుర్బుద్ధి, దుశ్చింత, కుయుక్తి, కుతంత్రము ఏ ఒక్కసారిగాని వెలిబుచ్చలేదు. న్యాయ బద్ధమైన తమ హక్కులనుగూర్చి పదేపదే ప్రసంగించి యుండవచ్చు; తమకు ధర్మము జరుగవలెనని పెక్కుమార్లు నొక్కి చెప్పియుండవచ్చుగాని, ఒకరిని ఒక దుర్భాషలాడి మనసు నొప్పించలేదు సరిగదా, ముక్కోటి ఆంధ్రుల పురోభివృద్ధిదృష్ట్యా, ఉమ్మడినుండి త్వరలో విడిపోవుట మిక్కిలి శ్రేయస్కరమని భావిస్తూ, తమ హక్కులను కొన్ని వదలుకొని, తాత్కాలికముగా తమకు కలుగనున్న కష్టనష్టాలను ధైర్యముతో ఎదుర్కొనుటకు సంసిద్ధులై ప్రవర్తించినారు. తక్కినవారి మాటటుండనిచ్చి, వయోవృద్ధుడు, జ్ఞానవృద్ధుడు, అనుభవ రాజకీయవేత్త యునై, ముఖ్యమంత్రివంటి బాధ్యతాయుతమై, పక్షవాదమున కతీతముగా నుండవలసిన ఉచ్చస్థానాన్ని అలంక రించుచున్న శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారిగారు, కేవలం తమిళ పక్షపాతము ప్రకటిస్తూ, ఎన్నోమార్లు కొన్ని అసభ్యపు ప్రకటనలు, ప్రసంగములు చేసినప్పుడుకూడా, ఆంధ్రనాయకులు, ఆంధ్రప్రజ సహితం అతి శాంతముగా భరించి, వృద్ధనాయకుడుగా తమ గౌరవానికి పాత్రులు కావలసిన ముఖ్యమంత్రిగారు ఇట్టి పక్షవాదానికి దిగడం శోచనీయమని విమర్శించడముదక్క తక్కువమాట వేరొకటి నోట జారకుండా, చాలా సభ్యతగా ప్రవర్తించడం, ఆంధ్రులందఱూ గర్వకారణముగా హర్షించవలసిన విషయము.

వాంఛూ నివేదికవల్లనూ, పత్రికలలో దినదినమూ వెలువడుతున్న ప్రకటనలవల్లనూ యథార్థస్థితిని అవగా హన చేసికొనగల అవకాశము కేంద్రప్రభుత్వమునకూ, భారతనాయకుడుగా, భారతజాతి సారథిగా వ్యవహరిస్తున్న ప్రధానికి పూర్తిగా చిక్కినదనియే భావించాలి. కాని 5-వ తేదీన ప్రధాని చేసిన ప్రకటనలో, వాంఛూ నివేదికలో సూచించిన సూచనకు వ్యతిరేకముగా, మదరాసులో తాత్కాలికముగానైననూ ఆంధ్రరాజధాని ఉండరాదని ఉండడం నాయకులకందఱకూ చాల నిరుత్సాహమును కలిగించడమేగాక, ప్రభుత్వపంథాలో కంచే చేనుమేసే విధానము వ్యక్తపరుస్తూవున్నది. తాత్కాలిక రాజధాని మదరాసులో ఉండడంవల్ల, నాయకుల తలకాయలలో మాత్రమే చెలరేగు చున్న ఉద్రిక్తత ప్రజలలో ప్రతిబింబించు భయ మేమాత్రము ఉండనవసరములేదని వాంఛూగారు తమ నివేదికలో స్పష్టపరచినవిషయము యదార్థమైనది. ఈయదార్థాన్ని గ్రహించలేకనో, పాటించలేకనో కేంద్రప్రభుత్వము ఈప్రకటన చేసినందువల్ల వాంఛూ చేసిన మిగతాసూచనలనుమాత్రము ప్రభుత్వమేపాటి పాటించబోవుననే సందేహముకలుగకపోదు.

ఎవరో ఒకరిద్దఱి పట్టుదలకు, ప్రచారానికి, లొంగిపోయి నిర్ణయములుచేసే సందర్భములో, యీ పరిశీలనలు, ప్రత్యేకవ్యక్తుల నియామకాలు, కాలయాపనలు, వృథావ్యయప్రయాసలుగా తోచకమానవు. మదరాసునుఆంధ్రులు ఈవిధ ముగా ఒదులుకోవలసిన పక్షానికి, యీ ప్రకటన, ఇంతనాటకములేకనే ఏనాడో, ఏకవ్యక్తినిర్ణయముగాజరిగియుండవచ్చు.

ఇక గడచినదానికి వగచి ప్రయోజనములేదు. రాబోవుదానికి ఎక్కువగా ఆశించియు ప్రయోజనములేదు. ఏ చిక్కులున్నప్పటికినీ, ఆంధ్రులంతా యీపరీక్షా సమయములో ఏకలక్ష్యముతోవ్యవహరించి, ఇచ్చినంతవరకూపుచ్చుకుని సమగ్ర నిర్మాణమును, స్వప్రాంతములోనే సాగించుకోవడం అతివాంఛనీయమైన విషయము. తాత్కాలిక రాజధాని మదరాసులో లేకపోవడంవల్ల, తక్కినవిషయము లెట్లున్నప్పటికీ, మనసంపద పరస్థలములో వ్యయముగావడం తప్పు తుంది గనుక, ఇదికూడా మనమేలుకొఱకేనని భావించడం ఉత్తమము. చెన్నపురి ఆంధ్రుల భవితవ్యము, వారిహక్కు భుక్తములు, నిర్ణయించుకోగల సామర్థ్యము వారికి తప్పకుండాకలదు. చెన్నపురి ఆంధ్రప్రాంతములో జేర్చలేదన్నంత మాత్రాన, అక్కడ తాత్కాలిక ఆంధ్రరాజధానికూడ ఉండగూడదన్నంతమాత్రాన, ఆంధ్రులు నిరాశజెందుట అనవస రము. చెన్నపురిలోని ఆంధ్రులు తమకు అన్యాయము జరుగునని ఊహించి భయపడుట అంతకన్నా అనవసరము. ఆంధ్రులంతా ఎక్కడఉన్నా ఏకలక్ష్యముతో, స్వార్థరహితమైన దేశాభివృద్ధిని వాంఛిస్తూ, నిస్వార్థపరులై, సంకుచిత మనస్థత్వమును విడనాడి, ధైర్య స్థైర్యములతో, పట్టుదలతో, తెలివితేటలతో, వ్యవహరించడం అత్యవసరము.

# ★ ప్రస్తుత పరిస్థితులు ★

శ్రీమతి అచ్యుతుని గిరిజ

## విధాయకం - వివేకం.

"వెంగీ లెంగీ లంట (ఎంగిలి) విగ్గేన పరులంట.
జగమంత యెవరెంగిలే,
భావిలోని నీరు తాగుదామంటె కప్పముట్టిన వెంగిలే;
చెరువులోని నీరు హారగింతా మంటె
జేప ముట్టిన వెంగిలే."

అని పాడుకుంటు విజ్ఞాన పరుడైన ఒక తత్వ జ్ఞాని మా చిన్న తనంలో ముష్టికి వచ్చేవాడు. తత్వం తలకెక్కని ఆ రోజుల్లో యీ పాట వినిపించిన ప్పుడల్లా కప్పలు, చేపలు మొదలయిన వన్నీ మంచినీళ్ళ గ్లాసులో నుంచి చూసి నవ్వుతున్నట్లు తోచేది. కాని కాలం గడిచిన కొద్దీ ఆ ముష్టివాడి పాటే మెరుగని అనిపిస్తు న్నది. ఎందువల్లనంటే అతను పేర్కొన్న చేపలను, కప్ప లను అదిలించి అవతలకు తోలటానికయినా సాధ్యపడు తుంది. మరి ఆధునిక శాస్త్రజ్ఞుల అభిప్రాయాన్ని పట్టి అండ పిండ బ్రహ్మాండ మంతా కళ్ళకు కనిపించని సూక్ష్మ క్రిములతో నిండివున్నదని తేలుతున్నది. నరమాత్రుల మయిన మనకు తెలియకుండానే క్రిమికోటి మననోట్లో నుంచి, ముక్కులోనుంచి యధేచ్ఛగా రాక పోకలు సాగిం చుతు వుంటవిట. ఇది విన్నప్పుడల్లా కొంచం కంపర మెత్తక మానదు. కాని సత్తువ తెచ్చుకుని లేచి తిరగటం కోసం దీనికొక విరుగుడు ఉపాయం సూచించారు. శుభ్రంగా, శుచిగా, ఆరోగ్యంగా వుంటే యీ క్రిముల రాక పోకల వల్ల మనకు అపాయం అట్టే వుండదని వివ రించారు.

ఆమాటను ఆధారంగా తీసుకుని బొంబాయిలో ఒక పాల సంస్థను కొత్తపద్దతుల ననుసరించి నడుపుతున్నారు. శుభ్రమైన చోట్ల పశువులను వుంచి, మంచి మేతవేసి, చేతులతో తాకకుండ పాలు తీసి, సీళ్ళు వేసిన సీసాలలో పోసి ప్రజలకు అందిస్తున్నారు. తినే పదార్థం మాత్రమే శుభ్రంగా, ఆరోగ్యంగా వుంటే చాలదు. అది అందించే మనుష్యులు కూడ శుచిగా ఆరోగ్యంగా వుండాలి. లేక పోతే యీ ప్రయాస అంతా వ్యర్థమేనని కనుక్కున్నారు రంగూను కార్పొరేషను వారు. పెద్ద పెద్ద పట్టణాలలో, హోటళ్ళల్లో కాఫీ కప్పులు ఐస్‌క్రీం ప్లేట్లు అందించటానికి తెల్లని పొడుగాటి బురఖాలు తొడుక్కున్న వడ్డనగాళ్ళు వుంటారు. తెల్లని అంగీ తొడుక్కుంటే చాలదని, అది తొడుకున్న మనిషి శుచిగా, ఆరోగ్యంగా వుండాలని, అసలు తెరవెనుక రాజ్యమేలే గరిటె పాణులయిన నల భీములంతా కూడ ఆరోగ్యంగా వుండి తీరాలని రంగూను కార్పొరేషనువారు ఒక కొత్త చట్టం ప్రవేశ పెట్టారు. ఈచట్టాన్ని అనుసరించి డాక్టర్లు పరీక్షించి లైసెన్సు యిస్తేనే తప్ప కాఫీ హోటళ్ళలో (చిన్నా పెద్ద) భోజన హోటళ్ళలో వంట చేయటానికిగాని, ప్లేట్లు అందించటా నికిగాని వీలుపడదు. తినే వస్తువులను గురించి యింత శ్రద్ధ తీసుకుంటే క్రిమి ప్రచారంతో తల తిరిగి ఆందోళన పడుతున్న ప్రజలకు కొంత ధైర్యం తప్పక కలుగు తుంది. ధైర్యమే జయమన్నారు పెద్దలు. పత్రికల ద్వారా ఎగ్జిబిషన్లు, సినిమాల ద్వారా అతి తీవ్రంగా క్రిమి ప్రచారం మాత్రం చేసి మిడి మిడి జ్ఞానం కలిగించి ప్రజల మనసు కలవర పెడుతున్న ఆరోగ్య శాఖ యింతటితో తమ విధాయకం తీరి పోయిందని అనుకోవటం పొరపాటు. రంగూను కార్పొరేషనువారి పద్ధతిని అనుసరించి యీ యీ సదుపాయాలు, పద్ధతులు ప్రవేశపెట్టి మీ ఆరోగ్యం కాపాడుతున్నాము అని ప్రజలకు ఒక నమ్మిక, ధైర్యము కలిగించ వలసిన బాధ్యత కూడ వున్నదని ప్రభుత్వ ఆరోగ్య శాఖ భావించాలి.

* * *

## వైద్యో నారాయణో హరిః

"పంచవర్ష ప్రణాళిక విజయవంతం కావాలంటే ప్రజలు శారీరకంగాను, మానసికంగాను కూడ ఆరోగ్యంగా వుం డాలి. అందుచేత వైద్యులు శరీరానికి చికిత్స చేయగలిగి నట్లే మనోవికాసానికికూడ తోడ్పడాలి. వైద్యసహాయం ప్రజాసామాన్యానికి అందుబాటులో వుండటం చాలా అవ సరం" అని లేడీ హార్డింజి మెడికల్ కాలేజీలో మాట్లా డుతూ డా॥ రాధాకృష్ణనుగారు అన్నారు.

## ప్రస్తుత పరిస్థితులు

ప్రభుత్వ మిస్తున్న జీతాలు చాలక, వసతులు చాలకన్నే డాక్టర్లువచ్చి పనిచేయకపోవటము కారణంగా మధ్యప్రదేశ్ లోని 28 గ్రామీణ ఆస్పత్రులను మూసివేయవలసి వచ్చిందన్నవార్త భారత ఉపాధ్యక్షులు పైవాక్యాలు చెప్పిన రోజునే వెల్లడి అయింది. అందువల్ల డా॥ రాధాకృష్ణన్ గారి మాటలు సందర్భోచితంగా వుండటమేకాక అటు విద్యార్థుల నుద్దేశించి చెప్పిన విషయం యిటు భారత ఆరోగ్యశాఖకి కూడా చక్కని ప్రబోధం కలిగించ గలిగి వున్నది. బహుశ ఆ కారణాననేమో రాజకుమారి అమృత కౌర్ వైద్య సహాయం ప్రజాసామాన్యానికి అందుబాటులో యెల్లా వుంచగలమనే విషయాన్ని తప్పించి, వెంటనే లేచి "అమ్మాయిలూ మీరందరూ డాక్టరు పరీక్ష ప్యాసయి కనీసం 5 సంవత్సరాలయినా దేశసేవ చేయాలి. నవభారత నిర్మాణంలో యిది మీవిధాయకం", అని బోధించేరు. ఇంతకూ గ్రామీణ ఆస్పత్రులు మూయ వలసి వచ్చిన కారణం డాక్టర్లకు జీతాలు చాలక వసతులు లేక పోవటమే. పోనీ, మంత్రిగారి కోరిక ననుసరించి దేశసేవ మాట జ్ఞాపకం పెట్టుకుని చాలని జీతాలతో తృప్తిపడి యీ డాక్టర్లు వెళ్ళి మూసిన ఆస్పత్రులను తెరిచారని అనుకుందాము. అప్పటికయినా డాక్టర్లు అక్కడ వుండి గ్రామీణులకు నిజంగా వైద్య సహాయం చేయాలి అని అనుకుంటే కొన్ని వసతులు కలిగించక తప్పదు గదా. కుంటి బల్లల ముందు ఊగులాడే కుర్చీ వేసుకు కూర్చుని చేత్తో తాకి జ్వరం చూస్తూ సప్లయి చేసిన దగ్గు జలుబు మిక్చరే అన్నిటికీ వాడుతూ వుంటే అది దేశసేవ మాత్రమే అవుతుంది. గాని వైద్య సహాయం యెట్లా అవుతుంది? ఈమాత్రపు దేశ సేవకు డాక్టరు కోర్సులో వుండే పెద్ద డిగ్రీలు తప్ప పనికి రావంటారు మన మంత్రిణి గారు. ఇది చాలక తక్కువ కాలంలో అయిపోయే వైద్య పరీక్షలు డిప్లోమా చదువులు సమూలంగా తీసి పారవేయాలని కూడ తీవ్రంగా ఆందోళనచేస్తున్నారు. అసలే యేడాక్టర్లూ వచ్చి గ్రామాల్లో వుండటం లేదు, పని జరగడంలేదని చూసిన మీదట మంత్రిణిగారు వైద్యంలో చిన్న కోర్సులన్న వన్నీ ప్రతిఘటిస్తున్నారంటే వైద్య సహాయం సామాన్య ప్రజల అందుబాటులోకి యెంతగా తీసుకు రావాలని చూస్తున్నదీ స్పష్టమవుతున్నది. అసలు వైద్య సహాయాన్ని ప్రజాసామాన్యానికి అందుబాటులోకి తీసుకు రావాలన్న సత్సంకల్పం ఒక్కసారిగా అన్ని ప్రదేశాలలోను మాయమయినట్లున్నది. మన పొరుగునే ఉన్న మైసూరు బడ్జెట్‌లో కొరత లేక పోగా మిగులు వుంటుందని చెప్పుకొంటున్నారు. కాని ధర్మంకామందు నీళ్ళు పోసే ప్రభుత్వ ఆస్పత్రులలో కూడ డబ్బు తీసుకొన నిశ్చయించుకున్నారుట. ఇగ్లాండులో లేబరు పార్టీవారు ప్రవేశపెట్టిన ఉచిత వైద్య విధానం యింక వుండటానికి వీలు లేదని తరువాత తామే తీసిన విషయం విశదమేగదా. అయితే పాశ్చాత్య దేశాలలో వైద్య సహాయం చేయవలసిన డబ్బుతో మారణాస్త్రాలు కూడ తయారు చేస్తున్నారు. అహింసా ప్రధాన మయిన మన దేశంలో యింకా ఆపని జరగటం లేదు.

ప్రజాసామాన్యానికి వైద్య సహాయం ఎంత మాత్రం అందుబాటులోకి రావడంలేదు. ఇంత కాలం మందులు వూరికే యివ్వక పోయినా వాటి ధరల మీద సగటున ప్రభుత్వం కంట్రోలు వుంచుతు వచ్చింది. ఇప్పుడు పెద్ద యెత్తున మందులలో వర్తకం చేసే పెద్ద లందరు "మేము చాలా దేశ భక్తులం, నిజాయితీపరులం, మీరు ధరల కంట్రోళ్ళు తీసివేసినా యేమీ గిరాకి చేయం, యింకా వుపకారమేచేస్తాం" అని ప్రభుత్వంతో మనవి చేసుకుంటున్నారు. అంతటి వుదారులకు ధరల కంట్రోలు వున్నందువల్ల జరుగుతున్న అపకార మేమిటో ఇంక కంట్రోలుకూడ లేకపోతే మందుల గిరాకీకి ఆగలేక ప్రజాసామాన్యం మందులే మానుకుంటారు. అప్పుడు వైద్యసహాయం ప్రజలకు మరీదగ్గరకు వచ్చినట్లే. అయినా తప్పు ప్రజాసామాన్యానిదే. రోగిష్టివాళ్ళయి కునిష్టి బ్రతుకు బ్రతికే యీ ప్రజాసామాన్యానికి ప్రభుత్వం యెందాక వైద్యసహాయం చేయగలదు. వైద్యో — నారాయణో — హరిః — అని స్తోత్రపాఠంచేస్తు స్పెషలిస్టుల దగ్గరకు పరిగెత్తుకు వెళ్ళి, వాళ్ల వ్రాసియిచ్చిన కనీ వినీ యెరుగని కొత్తమందులన్నీ బోలెడంత డబ్బుపెట్టి కొనుక్కుని తిని, యిల్లూ వొళ్ళూ గుల్ల చేసుకోవటం ఒక్కటే ప్రస్తుతం ప్రజానీకానికి అందుబాటులో వున్నవిషయం.





# రాజకీయాలు

* శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు *

ఫిబ్రవరి చివరి వారంనుంచి మార్చి మూడో వారం వరకూ ప్రపంచ రాజకీయ రంగంలో నడచిన సంఘటనల్లో సోవియట్ మహానాయకుడు స్టాలిన్ మరణం చెప్పుకో తగ్గది. భారత రాజకీయాలన్నింటిలోకీ ఆంధ్ర రాజధాని విషయమై జరుగుతున్న రసాభాసు అద్వితీయంగా ఉన్నది.

*   *   *

మార్చి 2 వ తేదీన పక్షవాతం వచ్చి 5 వ తేదీ రాత్రి మార్షల్ స్టాలిన్ మరణించాడు. లెనిన్ స్థాపించిన సోవియట్ యూనియన్, ధనికవాద దేశాలయిన బ్రిటన్, ఫ్రాన్స్, జపాన్ మొదలయిన దేశాల సాయుధ దండయాత్రలను తట్టుకుని నిలవగలగటానికీ, ప్రచండ నాజీసైన్యాలను నిర్మూలించి, ప్రపంచ జనాభాలో మూడోవంతుకు నాయకత్వం వహించకలగటానికీ, భారతదేశంలోని సంస్థానాల కన్నా హీనంగా ఉన్న పరిస్థితినుంచి అమెరికానుకూడా ప్రతిఘటించి నిలవగల స్థితికి రావటానికీ మార్షల్ స్టాలిన్ చేసిన కృషిని గురించి అందరికీ తెలుసు. 'ఒక్క సోషలిస్టు నిర్మాణ కార్యక్రమం యుద్ధతంత్రాలలో మాత్రమే స్టాలిన్ ప్రవీణుడు కాదు. యుద్ధరంగంలో మహాయోధుడుగా ఉండికూడా, శాంతికోసం కృషిచేసినవ్యక్తి స్టాలిన్' అని భారత ప్రధాని నెహ్రూ పార్లమెంటులో చేసిన ప్రశంస స్టాలిన్‌లో ఉన్న మరొక విశేషాన్ని సూచిస్తున్నది.

*   *   *

గొప్పవాళ్ళందరిమాస్తరే స్టాలిన్ విపరీతమైన దూషణ, భూషణాలకు గురి అయినాడు. పొగడ్తలను మనం పట్టించుకోనక్కరలేదుగాని, దూషణలను గురించి మాత్రం కొంత పరిశీలించటం అవసరం. ఆవిమర్శల్లో ముఖ్యమైనవి ఇవి—

1) ప్రపంచ సోషలిస్టు విప్లవవాది అయిన ట్రాట్‌స్కీనీ, అతని అనుచరులనూ స్టాలిన్ నిర్మూలించి, ప్రపంచవిప్లవ వాదాన్ని తిరస్కరించాడు. 2) స్వదేశంలో ప్రజలకు స్వేచ్ఛలేకుండా చేశాడు. 3) విదేశాల్లో విద్రోహాలను పురికొల్పి 'కమ్యూనిస్టుసామ్రాజ్యాన్ని' వ్యాపింప జేశాడు.

రష్యావిప్లవం మొదటిరోజుల్లో ప్రముఖుడుగా ఉన్న ట్రాట్‌స్కీ తరవాత దేశద్రోహిగా శిక్షించబడటంవల్ల బయటి దేశాల వాళ్ళకు ఆశ్చర్యం కలగటం సహజమే. కాని రష్యావిప్లవం జరిగిన 20 సం॥ తరవాతనే 1937 లో మాత్రమే ట్రాట్‌స్కీని శిక్షించటం జరిగిందనీ, స్టాలిన్ 1924 లో అధికారంలోకి వచ్చిన తరువాత 13 సం॥లపాటు ట్రాట్‌స్కీ రష్యాలో నిరాటంకంగా ఉండగలిగాడనీ గమనిస్తే అందులో అంత విడ్డూరం కనిపించదు. ఇరవై సం॥ లలో వ్యక్తుల అభిప్రాయాలు మారటానికీ, కొత్త దారులు త్రొక్కడానికీ ఎంతో అవకాశం ఉన్నది.

ప్రపంచ విప్లవం తీసుకుని రావాలని ట్రాట్‌స్కీ, రష్యాలో జయప్రదమైన విప్లవాన్ని నిలబెట్టి దానిని ప్రపంచ విప్లవాలకు మార్గదర్శిగా చేయాలని స్టాలిన్ అభిప్రాయపడ్డారు. రష్యా విప్లవానికి ముందూ వెనకా కూడా, చరిత్ర స్టాలిన్ వాదాన్ని సమర్థిస్తున్నది. శాస్త్రీయమైన మధ్యతరగతి ప్రజాస్వామిక విప్లవం 18 వ శతాబ్దపు చివరి పాదంలో, ఫ్రాన్సులో జరిగింది. ఆ విప్లవకారులు తమ దేశంలో రాజరికాన్నీ, భూస్వామిక పద్ధతినీ రద్దుచేయటంతో తృప్తిపడక, యూరప్ అంతటిలోనూ రాజరికాలను నిర్మూలించదలచినవారికి తోడ్పడుతామని ప్రకటించారు. సైనిక శక్తినిపట్టి ఇది అసాధ్యమన్న సంగతి అటుంచి,

నిత్యం కొట్లాడుకుంటున్న యూరపియన్ రాజులంతా కలిసి ఫ్రెంచి ప్రజాస్వామ్యంమీద దెబ్బతీయటానికి ఇది కారణ మయింది. ఫ్రెంచి విప్లవనాయకులు ఇట్లా ఉద్రేకపడకుండా ప్రజలను ఇచ్చిన వాగ్దానాలను చెల్లించి, తమ ప్రజాస్వామ్యాన్ని బలపరుచుకుంటూ, యూరపియన్ రాజులను భయభ్రాంతులుగా చేయకుండా ఉన్నట్లయితే వాళ్ళంతా కలవటమన్నది సాధ్యపడేదికాదు. తిరిగి నెపోలియన్ కింద వెనకటి భూస్వామిక పద్ధతి వచ్చి ఉండేదికాదు. ఫ్రెంచి ప్రజలంత పెద్ద ఆదర్శాలు పెట్టుకోకపోయినా వాళ్ళకన్న ఎంతో ముందుగా బ్రిటిష్ మధ్యతరగతి ప్రజలు తమ రాజైన మొదటి చార్లెస్ తల కొట్టివేసినప్పటికీ యూరప్ రాజులు ఏమీ పట్టించుకోలేదన్న సంగతిని ఈ సందర్భంలో జ్ఞాపకం పెట్టుకోటం అవసరం.

సోవియట్ నాయకులు ముందు తమ ఇంటిని చక్కబెట్టుకోవాలని ప్రయత్నించటంవల్లనే ఆదేశం నిలవకలిగింది అంతేకాకుండా ధనికవాద దేశాలు దానిని నలిపివేయటానికి చేసిన ప్రయత్నాలను ఆదేశాల ప్రజలే నిరసించటం జరిగి, అవి కనీసం బహిరంగ శత్రుత్వాన్నయినా కట్టిపెట్టినవి. ధనికవాదంలో ప్రస్తుతం ఇమిడిఉన్న వైరుధ్యంవల్ల వాటి అంతఃకలహాలు క్రమక్రమంగా పెరిగి, పోరాటాలను దిగుతవనీ, ఆవిధంగా ధనికవాదపుశక్తి క్షీణించిన ఆదేశాలలో సోషలిస్టు వ్యవస్థకు అనుకూల పరిస్థితులు ఏర్పడతవనీ, లెనిన్, స్టాలిన్‌లు గుర్తించి దానికి తగినట్లుగా నడుచుకున్నారు. జర్మనీ పశ్చిమ రాజ్యాల పరస్పర సంఘర్షణ జపానుతూర్పు యూరపులలోనూ, ఆంగ్లో-అమెరికన్ వర్గాల సంఘర్షణ చైనాలోనూ సోషలిస్టు ప్రభుత్వాల స్థాపనకు దారితీసినదన్న సంగతి గమనిస్తే ఇది ఎంత నిజమో తెలుస్తుంది.

అంతేకాదు. ఈ ధనికవాద దేశాల పరస్పర సంఘర్షణ వల్ల ఆయాదేశాల పీడిత ప్రజలకు విమోచన లభించటమే కాక, ఖండాంతరాల్లో నాటి పీడనకు మగ్గుతున్న వలస దేశాల ప్రజలకుకూడా విమోచన లభిస్తున్నది. కొరియా మొదలుకుని ఉత్తరాఫ్రికా వరకూ గల అనేక దేశాల్లో జాతీయ వర్గాలది పైచేయికావటం, ఇండియా, బర్మా మొదలైన దేశాలకు స్వాతంత్ర్యం రావటం చాలావరకు ఈ కారణంవల్లనే.

మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్ మొదలైన కమ్యూనిస్టు సిద్ధాంతకారులు అంతటివరకూ కేవలం ఊహాలోకంలో, పగటి కలలుగా, గొంతెమ్మ కోరికల మోస్తరు ఉన్న సోషలిస్టు సమాజాన్ని విస్పష్టంగా వివరించి, దానిని సాధించటానికి శాస్త్రీయమైన పద్ధతులను ఏర్పాటుచేశారు. అందువల్ల సిద్ధాంత రూపంలో గొప్పదిగా కనిపించిన ప్రపంచ విప్లవ సిద్ధాంతం ఆచరణలో పనికిరాకపోయినప్పటికీ, లెనిన్, స్టాలిన్‌లు దానిని వదిలిపెట్టి ధనికవాదదేశాల మధ్యనే సోషలిస్టు సమాజ నిర్మాణానికి పూనుకున్నారు. అంతమాత్రాన వాళ్ళు ప్రపంచ విప్లవానికి నీళ్ళు వదిలినట్లు కాదు. ఈ రోజున ప్రపంచ మంతటిలోనూ అభ్యుదయ వర్గాలకు సోవియట్ యూనియన్ మీద ఆదరాభిమానాలు ఉన్నవి. వారికి అది మహత్తర దృష్టాంతంగా ఉన్నది. శాస్త్రీయ సోషలిజం సిద్ధాంతరీత్యా తిరుగులేనిది కావటం వల్లనే, వ్యక్తి స్వాతంత్ర్యం అని ఘోషపెట్టే ధనికవాద దేశాలుకూడా సాంఘిక విప్లవాన్ని వాయిదా వేసేందుకు పరిశ్రమలు మొదలైన వాటిని జాతీయం చేయటం అన్న నినాదాలను చేస్తున్నవి.

* * *

స్టాలిన్ దేశంలో వ్యక్తులకు స్వేచ్ఛ అనేది లేకుండా చేసి నియంతృత్వం చెలాయించినట్లూ, ప్రతిపక్షులను నిర్దాక్షిణ్యంగా నిర్మూలించినట్లూ, ఆరోపించబడుతున్నది. వ్యక్తి, స్వేచ్ఛ అనేమాటలకు భూస్వామిక వ్యవస్థలోనూ ధనికవాద వ్యవస్థలోనూ, సోషలిస్టు వ్యవస్థలోనూ తేడా ఉన్నది. అందులో మళ్ళీ ధనికవాద వ్యవస్థలో అనేక తేడాలు ఉన్నవి. బ్రిటిష్ లేబరుపార్టీ, అమెరికన్ డెమాక్రటిక్‌పార్టీ మొదలైనవి వ్యాపారకంట్రోళ్ళు, జాతీయకరణం మొదలైనవాటిద్వారా 'వ్యక్తిగత స్వేచ్ఛ'కు కొన్ని పరిమితులను విధిస్తున్నవి. కాని ఆదేశాలకేచెంది, అదే మధ్యతరగతి ప్రజాస్వామిక వ్యవస్థలకు ప్రతినిధులమని చెప్పుకుంటున్న కన్సర్వేటివ్‌పార్టీ, రిపబ్లికన్ పార్టీలు దానికి అంగీకరించక వెనకటి ప్రభుత్వాలు తీసుకున్న అభ్యుదయ చర్యలన్నింటినీ రద్దు చేస్తున్నవి. ఇట్లాగే మిగిలినవన్నీను.

సోషలిస్టు సమాజ స్థాపనకు శాస్త్రీయమయిన మార్గాలను పరిశోధించటంతో సోవియట్ యూనియన్ మానవ

-జాతికి చరిత్రలో అతిగొప్ప పరిశోధన నొకదానిని చేస్తున్నది. పరిశ్రమల్లో యంత్రాలను ప్రవేశపెట్టిన తొలిరోజుల్లో మధ్యతరగతి ప్రజాస్వామిక వ్యవస్థలు మానవజాతి అభివృద్ధికి ఎంతో తోడ్పడ్డవి. యంత్రాలు సర్వత్రా వ్యాపించి మానవజాతినే బానిసలుగా చేసుకోగలుగుతున్న ఈరోజుల్లో, ఈ ధనికవాద- మధ్యతరగతి ప్రజాస్వామ్యాలు నిష్ప్రయోజనమేమోనన్న అనుమానం పాతిక సం||లలో రెండు మహాయుద్ధాలను చూసినమీదట కలక్క మానదు. దీనికి సోషలిస్టు వ్యవస్థ తగినదారి చూపిస్తోందో లేదో తెలియాలంటే సోవియట్ యూనియన్ కృషి నిరాటంకంగా జరగటం అవసరం. అందువల్లనే కమ్యూనిస్టుదేశాలు శాంతిని కోరుతున్నవి. ఈఅంశాన్నే భారత ప్రధాని పార్లమెంటులో ఉదహరించారు.

* * *

కమ్యూనిస్టుదేశాల ప్రయత్నాలు విఫలమయితే మానవ జాతికి కలిగేనష్టం ఏమిటో భారతదేశమే నిరూపిస్తున్నది. పరిశ్రమల్లో చేతిపనే ముఖ్యంగా ఉన్నరోజుల్లో, ఆ పరిస్థితులకు అన్నివిధాలా తగినట్లుగా, ఎవ్వరూ నిరుద్యోగంతో బాధపడటానికి వీలులేని సాంఘికవ్యవస్థను- వర్ణవ్యవస్థను భారతదేశం సృష్టించింది. ఒక్కొక్క వృత్తిమీదనూ అభిమానం కలవాళ్ళు దానిని వరించి వర్ణాలుగా ఏర్పడ్డారు. క్రమక్రమంగా నాగరికత అభివృద్ధి అవుతున్నకొద్దీ వర్ణాలు పెరిగి, అష్టాదశ వర్ణాలుకూడా అయినవి. ప్రస్తుతం కనిపించే తారతమ్యాలు, విధినిషేధాలు అప్పుడు ఉన్నట్లు తోచదు. క్రమక్రమంగా విదేశీదాడులవల్ల స్త్రీలకు స్వయంవర హక్కు పోయినట్లే, వ్యక్తులకు వృత్తి వర్ణ హక్కు కూడా నశించిపోయింది. యుద్ధాలవల్ల దేశీయ అంగబలం నశించటం, కొత్తవాళ్ళు వచ్చిపడటం మొదలైన అవాంతరాలవల్ల కులకట్టుబాట్లు మరీ కఠినమైపోయి మొదటి ఉద్దేశాలతో సంబంధంలేకండా పోయింది. (ఈనాడు ప్రతిఫ్యాక్టరీలోనూ అందులో పని చేసే కార్మికుల సంఘంలో సభ్యులుగా ఉండే వారిని మాత్రమే చేరనివ్వాలనే "క్లోజ్డ్ షాప్" వాదం ఈపరిస్థితులనే చూపిస్తున్నది.)

ఉద్యోగహామీ, మత స్వాతంత్ర్యం (వ్యక్తిగతంగా ఇష్టమయిన దేవతను ఆరాధించే హక్కు) మొదలైన అతి ప్రధానవిషయాలను ఏర్పాటుచేయకలిగిన భారతీయవ్యవస్థ విదేశీదాడులవల్ల ఆత్మరక్షణకోసం సంకుచితం కాకుండా ఉన్నట్లయితే, ఇంకా ఎన్ని అంశాలను ప్రపంచానికి ప్రదర్శించగలిగేదో?

* * *

స్టాలిన్ విదేశాలలో విద్రోహాలు పురికొల్పినట్లు చేసే ఆరోపణలు నిరూపణకు అందనవి. సోషలిస్టు ప్రజాస్వామ్యాలు ఏర్పడిన దేశాలన్నీ- ఆగ్నేయాసియా, చైనా, తూర్పుయూరప్ — యుద్ధరంగాలుగామారి, స్థానిక ప్రజానీకానికి ఆయుధాలు లభించిన ప్రాంతాలే. ఈ ఆయుధాలు సప్లయి చేసింది ఎక్కువగా అమెరికా బ్రిటన్లే. స్థానిక ప్రజలు ఆ ఆయుధాలతో జపాన్, జర్మనీలనే కాక, తమను పీడిస్తున్న దేశీయధనికవాదులనుకూడా ఓడించారు. చైనా ప్రజలు స్వయంగానే సోషలిస్టు వ్యవస్థను స్థాపించినట్లు బ్రిటనే అంగీకరించింది.

తూర్పుయూరప్‌లో ధనికవాదులు జర్మనీతో చేయి కలపటమో, అమెరికా, బ్రిటన్లకు పారిపోవటమో చేయగా కమ్యూనిస్టులు, వారు పక్షం సోషలిస్టులు నిలబడి ప్రతిఘటనోద్యమాలను నడిపారు. ఈ ఉద్యమకారులపట్లా, వీరి అభ్యుదయ సామ్యవాద సిద్ధాంతాలపట్లా, ఒక్క తూర్పు యూరప్‌లోనేకాక యావత్తు యూరపులోనూ ఎంత ఆదరణ ఏర్పడ్డదో ఫ్రాన్సు, ఇటలీలలో కమ్యూనిస్టుపార్టీలకు వచ్చిన బలం సూచిస్తున్నది. బ్రిటన్‌లో లేబర్ పార్టీ గెలుపుకూడా దీని ఫలితమే. ఆంగ్లో-అమెరికన్ సైన్యాలు హామీ యూరపును ఆక్రమించి ఉండకపోతే, మార్షల్ పథకం, ట్రూమన్ సిద్ధాంతం మొదలయిన పేర్లతో అక్కడ కమ్యూనిస్టులను అమెరికా అడ్డగించకపోతే, ఏమి జరిగిఉండేదో?

కాని ధనికవాదులు మాత్రం సోవియట్ సైన్యాల ఆక్రమణే తూర్పు యూరపులో సోషలిస్టు ప్రభుత్వాల స్థాపనకు కారణమని ఆరోపిస్తూ ఉంటారు.

ప్రతిపక్షులను నిర్దాక్షిణ్యంగా నిర్మూలించటం విషయమై చేసే ఆరోపణలు ముప్పాతిక ముప్వీసం కేవలం

ప్రచారమేనని 1937 మాస్కో విచారణలను స్వయంగా చూసి వచ్చిన అమెరికన్ రాయబారి డేవిస్ వ్రాసిన వ్యాసాలవల్ల తెలుస్తున్నది. ఇటీవల జెకోస్లావేకియా కమ్యూనిస్టు ప్రజలమీద జరిగిన విచారణలు కేవలం యూదు వ్యతిరేకతను దేశంలో పురికొల్పి, కమ్యూనిస్టుపార్టీ పొరబాట్లను కప్పిపుచ్చివేయటానికని ప్రచారం జరిగింది. కాని రష్యాలో యూదు వ్యతిరేకత లేదని - ఇజ్రేల్ తో రష్యా తెగతెంపులు చేసుకున్న తరువాతనే — ఇజ్రేల్ రాయబారి ఎలీషెవ్ చేసిన ప్రకటన ఈ ప్రచారం బండారాన్ని బయటపెడుతున్నది.

* * *

స్టాలిన్ మృతివల్ల కమ్యూనిస్టు ప్రపంచం అల్లకల్లోలమవుతుందని ఇంగిత జ్ఞానం కలవాళ్లెవరూ అనుకోలేదు. అయితే నవచైనా పూర్తిగా నిలదొక్కుకునేవరకూ, కనీసం భారీపరిశ్రమలు పూర్తిగా ఏర్పడేవరకూ ఆయన జీవించి ఉంటే, అనుభవశాలి అయిన వ్యక్తి సాయం ఉండి ఉండేది.

* * *

ఆంధ్రరాష్ట్రాన్ని స్థాపించటానికి కేంద్రం అంగీకరించిందికాని, రాజధానివిషయమై పెద్ద రభస జరుగుతున్నది. మద్రాసులో తాత్కాలిక రాజధానిని ఉంచవీలులేదని ముఖ్యమంత్రి రాజాజీ హఠం వేసుకుని కూర్చున్నాడు. కేంద్రప్రభుత్వంకూడా థార్ కమిషన్ నివేదిక మొస్తరే వాంఛూ నివేదికనుకూడా బుట్టదాఖలుచేసి, రాజాజీ బెదిరింపులకు లొంగిపోయిందనీ, తెలుగు దేశంలోనే ఎక్కడయినా రాజధానిని పెట్టుకొమ్మని చెపుతుందనీ వార్తలు వస్తున్నవి. అవి నిజమయితే ఢిల్లీలో ఆంధ్ర కాంగ్రెసు నాయకులకు పూచికపుల్లపాటి విలువకూడా లేనట్లు నిరూపించబడుతుంది. ఆంధ్రకాంగ్రెసుకు గడచిన ఎన్నికలకు మించిన పరాజయమని భావించ వలసివుంటుంది.

ప్రకాశంగారు, ప్రజాసోషలిస్టులు ఏమిచేయదలిచారో తేలలేదు. చంద్రగిరిలో రాజధాని పెట్టాలన్న కృషికార్ లోక్ పార్టీ కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీతో సహకరించ నిశ్చయించింది కాబట్టి, కాంగ్రెసువాళ్లు కమ్యూనిస్టులు కావాలంటున్న 'విజయవాడ'ను వదిలి, చంద్రగిరిలో మకాం పెట్టవచ్చునేమో! కాని దానివల్ల రాజాజీ కోరినట్లు మద్రాసులో ధనం కుమ్మరిస్తూ ఉండటం జరుగుతుంది.

మద్రాసు విషయంలో నిజంగా పట్టుపట్టి పనిచేసే ఆంధ్రులు ఎందరున్నారన్నది సందేహాస్పదం. జె. వి. పి. రిపోర్టు సందర్భంలోనే ఈరంగు తేలిపోయింది. పట్టుబట్టి పనిచేసేవాళ్ళుంటే, తరవాతయినా ఉద్యమం సాగించి నగరాన్ని 'సి' తరగతి రాష్ట్రంగా చేయించవచ్చు. అదీకాక తమిళుల ధోరణిచూస్తే కేంద్రం ఒప్పుకున్నా ఉండటం మంచిదికాదేమోనని సంజీవరెడ్డిగారే సందేహిస్తున్నారు. విశాఖపట్టణాన్ని తాత్కాలిక రాజధానిగా అంగీకరించేది కొద్దిమందిమాత్రమే ఉంటారు.

ఆంధ్రరాష్ట్రంలో ప్రభుత్వనిర్మాణాన్ని గురించి అప్పుడే పార్టీల సన్నాహాలు మొదలుపెట్టినవి. కాంగ్రెసుపార్టీ నాయకుణ్ణి ఎన్నుకుని, కె. ఎల్. పి. తో సంబంధాలు నిశ్చయించుకున్నది. ప్రజాసోషలిస్టు పార్టీతో అఖిలభారత స్థాయిలోనే సంప్రదింపులు జరుగుతున్నవి. అవి ఫలించకపోయినా ఆంధ్రప్రాంతానికి వేరే ఏర్పాట్లు — వెనక యు. డి. ఎఫ్. సందర్భంలో జరిగినట్లుగా — జరగవచ్చును.

హైదరాబాదులో కూడా కాంగ్రెసు ప్రజాసోషలిస్టులను కలుపుకోలేకపోతే స్థిరప్రభుత్వం ఉండేటట్లు కనిపించదు.



## 1953 — గృహలక్ష్మి కంకణ గృహీత

# శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు

• శ్రీమతి కస్తూరి రంగనాయకమ్మ •

"ఆంధ్రకవయిత్రులు" అను 500 పేజీల గ్రంథమును రచియించి, తెలుగుభాషా సమితివారి గ్రంథరచన పోటీలో గెల్పొందిన శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ గారిని, ది 8-3-1953 న, శ్రీ కేసరిగారు గృహలక్ష్మి స్వర్ణకంకణ మొసంగి బహుకరించిరి. (ఉత్సవ సందర్భములో తీసిన ఛాయా చిత్రమును అట్టరెండవ పేజీమీద ప్రచురించి యున్నాము.)

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు 1917 వ. ॥సం॥ డిశంబరు నెల 25 వ తేదీన జన్మించిరి. ఈమె నాళం వారి ఆడబడుచు. శ్రీ సుశీలగారు, మధురకవి శ్రీ కృష్ణారావుగారు యీమె తల్లిదండ్రులు. ఈమెకు శ్రీ నాగేశ్వరరావు, శ్రీ కామేశ్వరరావు లను నిద్దరు సోదరులు గలరు.

లక్ష్మీకాంతమ్మగారి తల్లిదండ్రులు గూడ సాహిత్యారాధకులు. ఈమెకు సారస్వతాభిలాష పుట్టుకతోడనేజన్మించి, గృహవాతావరణ సహాయముచే దిన దినాభి వృద్ధిని గాంచినది. ఈమె మొదట వైశ్య సేవాసదనము యువతీ సంస్కృత శాలలో విద్య నభ్యసించెను. 1935.వ ॥సం॥ ఆంధ్ర విశ్వవిద్యాలయమున "ఉభయ భాషాప్రవీణ" పరీక్షలో ప్రథమ శ్రేణిలో సర్వప్రథములుగా నుత్తీర్ణురాలయ్యెను. ఈమెకు బ్రహ్మసమాజ సాధనమునందభిరుచి యున్నది. శ్రీ యల్లాప్రగడ జగన్నాథము పంతులు గారు ఈమెకు కొంత వరకు శ్రీ రామకృష్ణ, అరవింద, రమణ మహర్షుల బోధను నేర్పిరి. భారతీయముల్లైనను గాక పోయినను ఆధ్యాత్మికసాధనములపై ఈమెకు అభిమానము మెండు.

ఈమె బాల్యమునుండియు కేవలము పరిసరముల ప్రభావమునకులోనుగాక, ప్రతివిషయమును అవగాహన మొనర్చుకొని, అనుసరించు నట్టి ప్రవృత్తి గలది.

ఈమెకు 13 ॥ సం॥ వయస్సునందు—1930 ॥సం॥ మార్చి నెల 24.వ. తేదీన వివాహము జరిగెను. శ్రీ. ఊటుకూరు హయగ్రీవ గుప్తగారు యీమె భర్త. హయగ్రీవ



శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు

గుప్తగారి మాతాపితలు, పితామహులు సంస్కృత భాషాభిమానులే గాక, సంస్కృతీ ప్రియులుగూడ. ఈకారణము వలననే లక్ష్మీకాంతమ్మగారి విద్య నిరాఘాటముగ అభివృద్ధి నొంద గలిగినది. శ్రీ హయగ్రీవ గుప్తగారు పట్టభద్రులు, న్యాయవాది. సారస్వతాభి లాషి, కళాప్రియులు.

సంస్కృతాంధ్రముల రెండింటను ప్రజ్ఞ యున్నప్పటికిని యీమెకు తెలుగు భాషపై ఆదరమధికము. ఆంగ్లమున గూడ పర్యాప్తమగు పరిచయ మున్నది, ఈమె రచించిన "ఆంధ్రకవయిత్రులు" అను గ్రంధము తెలుగు భాషా సమితి వారిచే పుత్తమ మయినదిగా పరిగణించ బడినది. ఈమె సంస్కృతమున సంభాషించ గలదు, సభలలో గంభీరముగ పుపన్యాసమివ్వ గల నేర్పు గలది. ఈమెకు "ఉభయ భాషాప్రవీణ" యన్న విశ్వవిద్యాలయపు వారిచే నొసంగ బడిన బిరుదమే గాక; "విద్వత్కవయిత్రి" "ఆంధ్ర విదుషీకుమారి" "ఆంధ్ర సరస్వతి" కవయిత్రి తిలక" మను బిరుదులు, శ్రీయుతులు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, రాయప్రోలు సుబ్బారావు, చేపూల సత్యనారాణ శాస్త్రి మొదలగు కవి మహనీయులచే యాశీ: పురస్సరముగా నొసంగ బడినవి. ఈమె జంషడ్పూరు, బొంబాయి.

(తరువాయి 56-వ పేజీలో)



# "కీర్తిశేషులు"

నాటిక

శ్రీ కందుకూరి లింగరాజు

[మధ్యతరగతి గృహస్థుల ఇల్లు. సావిట్లో బల్ల, ఓ ప్రక్కగా సందుగా పెట్టి, రెండు మూడు కుర్చీలు, గోడకు గడియారం. సావిట్లోంచి ప్రక్కగదిలో మంచం కన్పిస్తూ ఉంటుంది.]

పాత్రలు

రామయ్యపంతులు [సావిత్రి, మంగమ్మలతండ్రి]
మాధవరావు — భార్య సావిత్రి
చలపతి — భార్య మంగమ్మ
పాపాయి — మాధవరావు కూతురు

[ప్రవేశం సమయానుకూలంగా కథాగమనంలో]

సావిత్రి : (చీపురుకట్టతో తుడుస్తూనే) పాపాయి! ఏసేవ్ పాపాయి! లోపల్కిరావే! వినపట్టంలేదూ?

పాపాయి : (లోపల్కివస్తూనే విసుగ్గాతల్లినైపుచూస్తుంది)

సా : ఏంపిల్లవేనీవ్వు: వీధిలో పిచ్చికగూళ్ళు కట్టుకుంటూ ఇప్పుడు కూర్చుంటారే! మీతాతయ్యచచ్చి మంచం మీద పడివుంటే! ఎవరేనా నవ్విపోరూ వెళ్ళూ! మంగమ్మ పిన్నివాళ్ళూ వస్తున్నారేమో చూడు ఆ! మర్చిపోయే! పట్టుచొక్కా వేసుకున్నావేమిటి? ఇలాంటప్పుడు వేసుకోవచ్చా!

పా: ఇంతవరకూ ఎప్పుడూ మనింటికి రానివాళ్ళు ఇప్పుడెందుకు వస్తున్నారే!

సా: వాళ్ళేనా! మీ తాతగారి వ్యవహారాలు మాట్లాడ్డానికి వస్తున్నారే! ఆయన చచ్చిపోయేడనగానే తెలిసి నాన్నగారు టెలిగ్రాం ఇచ్చేరు. (బయట చప్పుడువిని) వాళ్ళుకాదు కదా? (తలుపుతీస్తుంది) కాదులే బ్రతికిపోయాం! మీనాన్నే.

మాధవరావు : (జోళ్ళువిప్పుతూ, అద్దాలుతీస్తూనే)రాలేదు కదూ!

సా : కనపట్టంలే! పాపాయి! త్వరగా వెళ్ళి నిన్నకాజా కుట్టు కుట్టిన జాకెట్టు తొడుక్కోవే.

(పాపాయి గుణుస్తూ వెళ్తుంది)

మా : వాళ్ళువస్తారా అన్నదే నమ్మకం కల్గటంలేదు. ఇది వరకు మీరిద్దరూ తగవులాడుకొన్నప్పుడు, ఇంకనీ ఇంటి గుమ్మం త్రొక్కననే ఒట్టు పెట్టుకుంది మంగమ్మ.

సా : నమ్మకం కల్గటంలేదూ! ఎందుకురాదూ! మాచక్కా వస్తుంది. తనతండ్రి తనకేమాత్రం ఆస్తివదిలేడో అని భాగం పంచుకోడానికి మసిరాసుకునే వస్తుంది.

మా : నానీర్కావిపంచె ఏదే! అయితే ఒస్తుందంటావన్నమాట.

సా : అదా! మరీ చిరిగిపోయింది! తాడుమీద ఆరేసింది ఇంకోటి మడత పెట్టిపెట్టే! అదికట్టుకుందురూ!

మా : అది నాదికాదుగా!

సా : ఎవరదైతే ఏం! ఈమధ్య పంచలులేవని తెలుసుండీ, సంసారం ఈదలేక, కొనలేకపోయే! మానాన్న దేగా! మొన్ననే కొన్నాడు ఓచాపు! ఇప్పుడు మీరు కట్టుకుంటే ఏంపోయింది!

మా : అది సలక్షణమయిన అంగుళాలదే! అంగోస్త్రంలా ఉంటుంది నాకు!

సా : గోచీగుడ్డలా వుండదూ! ఏళ్ళువచ్చిన కొలదీ పిల్లలై పోతున్నారు. ఇంట్లో ఎనిమిదిగజాల గ్లాస్కో పంచె కట్టుకుని షోకుచెయ్యాలా ఏమిటి! కట్టుకోండి.

మా : సరే!

(ప్రక్కగదిలోకి వెళ్ళి పునః వస్తాడు పంచెకట్టుకుని. సావిత్రి గదిచిమ్మడం అయి పోగు ఎత్తుతుంది)

సా : అదేమిటి! ఆకట్టడం! వంటబ్రాహ్మణాడిలా! మంగమ్మ కళ్ళు పడిందంటే అదిమీదికాదని ఈకకు ఈక లాగేస్తుంది. ఎడం చేతి కొసలు పైకి దోపండి.

మా : సరా! (చెప్పినట్టుచేస్తాడు)

సా : ఏమండీ! ఆయనగదిలో వుంది సందుగాపెట్టె. దాన్ని గురించి ఆలోచన తెగట్లంలేదండీ! మీకు తెలుసుకదా ఆయన చచ్చిపోయినంతర్వాత నేను ఎల్లాగా తీసుకుందా మను కుంటున్నానని.

మా : అవును, అయినా నువ్వూ మంగమ్మా ఉన్న సామాను పంపకాల్లో మాట్లాడు కోండి.

సా : అదా! రాకాసి! నేనేది అడిగితే అదే కావాలంటుంది.

మా : అయితే మంగమ్మకీ దానిమీద కన్నుందన్నమాట!

సా : అదికాదండీ! ఆయన దీన్ని మొన్నజమీందారీ వేలం పాటల్లో కొన్నారు. ఇదికొన్నతర్వాత అది మనింటికి రానే రాలేదు! అల్లాంటప్పుడు ఆయనదని ఎల్లాఅను కుంటుంది?

మా : ఏమిటే సావిత్రీ!

సా : అవునండి! దాన్ని మనకొట్టుగదిలో పడేసేద్దాము. ఇప్పుడు. వాళ్ళు రాకుండానే.

మా : నాకు యిష్టంలేదు

సా : సింగినాదం! ఎందుచేత ?

మా : అదిబాగోదే. ఎల్లాగైనా కాస్త.....(నసుగుతాడు)

సా : మనయింట్లోఉంది దేవదారు చెక్కల కర్రపెట్టె. దాన్ని ఇక్కడ పెట్టేద్దాం. మంగమ్మ వచ్చినా దాన్ని చూచి అదేకావాలంటుంది. పైగాదాని పీడ వదల్చు కోవాలని ఎన్నో నాళ్ళనుండి చూస్తున్నా. ఇల్లంతా చెదపురుగులు మయం.

మా : మనం ఇల్లాచేస్తున్నప్పుడే వాళ్ళువస్తే...?

సా : వీధితలుపు గొళ్ళెంపెట్టివస్తా! అల్లాచూస్తారేం. తువ్వాలు నడుంకు కట్టండి... నేను కొట్టుగదిసర్దుతా

(లోపలికి గొళ్ళెంపెట్టడానికి వెళ్ళబోతుంది)

పా : (వస్తూనే) అమ్మ! పిన్నీసు పెట్టవే.

సా: ఇప్పుడే వచ్చింది. నీతొందరాను. వెళ్లు మీనాన్న పెడుతాడు.

(లోపలికి వెళ్ళుతుంది)

పా : (పిన్నీసు పెడుతుంటే) తువ్వాలు నడుంకు చుట్టేవేం నాన్న?

మా : మీఅమ్మా నేనూ కలిసి, తాతయ్య సందుగాపెట్టె కొట్టుగదిలోకి తేవడానికే

పా : అయితే పిన్నిరాకుండానే మనందాన్ని మనింట్లో పెట్టేసుకుందామా ?

మా : లేదు పాపాయి! తాతయ్య చచ్చిపోయే ముందట అమ్మకిచ్చేడు దాన్ని.

పా : ఇవ్వాళ ప్రొద్దున్నా ?

మా : అవును.

పా : ఇవ్వాళ ప్రొద్దున్న నాతో మాట్లాడనైనా లేదు తాతయ్య రోజూలా.

మా : అల్లాంటిమాటలు ఏం అనకూడదు ఇప్పుడు.

సా : (చేతిలో గోడగడియారం పట్టుకునివస్తూ) వచ్చే టప్పుడు దీన్నికూడా తెస్తే మంచిదనుకన్నా! దీన్ని ఆయనగదిలో పెట్టి అది తెచ్చుకుంటే!

పా : తాతయ్యదా!

సా: నీమొఖం! నోర్మూసుకో! తాతయ్యాదికాదు అదే మనది. మీపిన్ని వచ్చినప్పుడు ఏమైనా గడియారం సంగతి, సందుగా సంగతి ఎత్తేవా వీపు పేట్రేగిందన్న మాటే.

(ఇద్దరూకలిసి సందుగా, గడియారం పట్టుకెళ్ళుతారు వీధి గుమ్మంమీద చప్పుడు)

సా: (లోపలినుండి) పాపాయి! పిన్నీ, బాబయ్యా ఏమో చూడు. వాళ్ళయితే తలుపు తియ్యకేం.

పా: (కిటికీలోంచి చూస్తుంది.) అమ్మా! వాళ్ళేనే!

సా: కొట్టనీ! నేవచ్చేవరకూ కొట్టుకోనీ.

(వీధితలుపు చప్పుడు ఎక్కువగా వినిపిస్తుంది)

సా: (ఆయాసపడుతూనే) ఆతువ్వాలు విప్పి భుజంమీద వేసుకుని కుర్చీలో కూర్చోండి! నేను సరిగ్గావున్నానా! జుట్టురేగివుంది కదా! (బొట్టుచెరుపుకుని) పాపాయి! తలుపు తియ్యవే! వాళ్ళకోసం ఎదురు చూస్తున్నట్టుగా మాట్లాడండే!

(గుష్లమ్మట నీళ్ళు కుక్కుకుందుకు ప్రయత్నంచేస్తుంది. పాపాయి, మంగమ్మ, చలపతి, ఒకళ్ళవెనుక ఒకళ్ళు ప్రవేశం)

మంగమ్మ: అక్కయ్యా! నాన్న వెళ్ళిపోయేడే (బావురుమంటుంది)

సా: అవునే! (వెక్కిళ్ళల్లో కళ్ళుతుడుచుకుంటూనే) మొన్న దీపావళికి డబ్భైరెండూ, వెళ్ళేయి. ఇంకా! కొన్నాళ్ళు...

చలపతి: ఒదినగారూ! మీరల్లా బెంబేలు పడితే ఎల్లాగా, అందరం ఏదో రోజు వెళ్ళిపోయే వారిమే. అదృష్టవంతుడు ఆయిన, లేకపోతే.

సా: ఏం అదృష్టవంతుడు?

చ: ఆయనకేం? మహారాజాలా వెళ్ళి పోయింది జీవితం.

మా: మీకు టెలిగ్రాం వెంటనే అందిలేదా? ఆలస్యం అయ్యింది. మద్యాహ్నం బండికే వస్తాగనుకున్నాం.

చ: అందలేదు. ఆ బండికే వచ్చేద్దుం ఓఘుంట ముందరగా అందితే! అయితేకాని, డాక్టరు ఏమన్నాడు?

సా: చూస్తేనా?

మ: చూడనే లేదూ?

చ: పోనీ మీరు పిలిపించేరా వెంటనే!

సా: పిలిపించకేం, ఆయన మాట్లాడిస్తే పలక్క పోయే సరికి వెంటనే చాకలాడిని డాక్టరు మంగపతి గార్ని పిల్చుకు రమ్మన్నా. కాని అప్పటికే ఆయన పట్నం వెళ్ళేడుట.

చ: అల్లాంటప్పుడు ఇంకొకళ్ళని పిల్వవలసింది.

సా: బ్రతికినన్నాళ్ళూ మంగపతిగారే వైద్యం చేసేరు. చచ్చినా ఆయన చెయ్యవలసిందే. ఇంకోళ్ళని ఎల్లా పిలుస్తామండీ! వైద్యం మారితే శరీరం తిరగ బడదూ.

చ: మీకు మీనమ్మకాలేమిటో కాని.

మ: ఎంతపని చేసేరు! ఆఖరుకు నాన్న వైద్యుని సహాయం లేకుండానే చచ్చిపోయాడన్న మాట.

సా: పిచ్చిగా మాట్లాడుతావేమిటే! ఆఖరిఘడియలు వచ్చే సరికి డాక్టరు మాత్రం ఏంచేస్తాడు!

మ: అల్లా అంటావేమిటే? చచ్చిపోయారనుకున్న వాళ్ళని ఏన్నో ఘుంటలతర్వాత డాక్టరు చాలా మందిని బ్రతికించేరే!

మా: అవా! ఏనూతుల్లోనో పడ్డవాళ్ళ కేసులు అవి. అయినా మీనాన్న నూతులో పడలేదుగా.

చ: అందులో భయంఏముంది? ప్రపంచకంలో భయం లేని దేమిటంటే నీళ్ళల్లో పడ్డమే. (నవ్వబోతాడు)

మ: ఏమిటది? (బిక్క చచ్చి పోతాడు)

సా: ప్రొద్దున్నే లేచేరు. కాఫీత్రాగి ఇన్సూరెన్సు కట్టదామని బయటుకు వెళ్ళేరు.

చ: భీమా చేయించడం జీవితంలో చాలా ఉత్తమోత్తమమైన పని!

# కీర్తిశేషులు

సా : ఆ విషయాల్లోమాత్రం నాన్నకు మహా పట్టుదల ఉండేది. పదిన్నరకి తిరిగి వచ్చేసేరు. పాపాయి వెళ్ళి భోజనానికి రమ్మనమంటే, నేను రాను, నిద్రపోతా కాస్సేపు అన్నారు.

చ : అల్లాగా! పాపం!

మా : నేను వచ్చి చూచేసరికి, ప్రక్కమీద బోర్లాపడుకుని వున్నారు.

మ : నిజంగా ఆయనకు ముందటి సంగతి జ్ఞానం కల్గి వుంటుంది. అయినా మిమ్మల్ని గుర్తుపట్టేరా?

మా : నిద్ర పోతున్నారని మాట్లాడించ లేదు.

మ : పోనీ అనుమానంగా ఉందిఅని ఏమైనా సూచించేరా?

మా : లేదు.

సా : నే భోజనం చేసినతర్వాత ఏమైనా కాసిన్ని పాలు త్రాగుతారేమో అని పట్టుకువెళ్ళి సందుగా... కాదు కాదు, దేవదారు పెట్టెమీద పెట్టి లేపడాన్కి వేళ్ళే... అప్పటికే శరీరం అంతా చలవకాడలా అయ్యింది.

మా : అప్పుడే సావిత్రి పెద్దకేక పెడితే పరిగెత్తుకు వెళ్ళే.

సా : ఇంకేం చెయ్యగలం?

మ : అప్పటికి చచ్చి పోయారన్న మాట.

మా : నిస్సందేహంగా!

మ : నేను ఎప్పుడూ అనుకుంటూ ఉండేదాన్ని నాన్న రాజా చావు చస్తాడని.

(కళ్లుతుడుచు కుంటారు)

మా : మరి మీరు ఓసారిచూడరూ! నేను బ్రాహ్మణ్ణి వాళ్ళనీ పిల్వనంపుతా! మీకోసం అని......

మ : నాన్న సమాధిమీద పాలరాతి తులసికోట కట్టించాలి.

సా : గాజుపలకలు పెట్టించి ... జననం ... మరణం అని కూడా వ్రాయిస్తే

చ : బావుంటుంది. అయితే మరి ......

మా : తాపీవాణ్ణి కూడా పిలిపించాలన్న మాట.

సా : అవన్నీ తాపీగా చూసుకోవచ్చు. వేవండీ ఆగదిలో సామాను అవి సర్దాలికా

మ : అవును! ఆయన వన్నీ సామానులు ఓలిస్టు తయారు చేయించాలి. కుర్చీలుఅవీ అల్లాంటి కర్రసామానులు కూడాను.

మా : నగలూ, నాణేలు ఆయనగదిలో ఏంలేవు.

మ : ఆయన బంగారపు జేబుగడియారం తప్ప, దాన్ని మా అబ్బాయి కిస్తానని వాగ్దానం చేసేడు

సా : వాగ్దానం చేసేడు! నేనెప్పుడూ వినలేదే

మ : చేసేడు. అప్పుడు నాన్న మాఇంట్లో ఉండేవాడు. అబ్బాయి అంటే ఒక్కక్షణం కూడా విడచి ఉండేవాడు కాదు.

సా : అదినాకు తెలియదు.

చ : పోనీలే! ఆయన ఇన్సూరెన్సు డబ్బుఉందికా! ఇవ్వాళ ప్రొద్దున్న కట్టిన ప్రిమియం రసీదు పుచ్చుకున్నారా.

సా : నేచూడనే లేదుదాన్ని.

పా : (తల్లి వెనక్కు వస్తూనే) అమ్మా! తాతయ్య ప్రొద్దున్న ఇన్సూరెన్సు ఆఫీసుకు వెళ్లినట్టు లేదే.

సా : అదంతా నాకేం తెలుసు! పైకిమాత్రం వెళ్ళేరు.

సా : వీధిలోకి వెళ్ళేసరికి పుణుకుల రామయ్య కనిపించేడు. ఇద్దరూ కలసి మూలావారి వీధిలోంచి......

మా : ఇంకే! బంగారమ్మ హోటలుకు వెళ్ళేరన్న మాట.

చ : బంగారమ్మ హోటలు?

సా : ఇంకేంవుంది. ఆజుట్టువుంచుకుని కళ్లు త్రిప్పుకుంటూ ఉన్న బోడెక్క. హోటలంటూ పెట్టె, నలుగుర్నీ జేరేసుకుని తైతెక్కలాడేది. అక్కడికి వెడితే ఇంక ఎక్కడి ప్రిమియం కట్టడం.

చ : అయితే కట్టలేదంటారా? కాలం దాటి పోయిందా?

సా : దాటిందేమో అనుకుంటా.

మ : కట్టివుండరు! ఏదో చెప్తాతోందే! కట్టలేదని. అనుమానంలేదు.

చ : ముసలి రసికుడు

సా : ఈపని చెయ్యాలనే చేసివుంచారు. ఇన్నాళ్లూ ఉంచుకుని సపర్యలు చేసినందుకు ప్రతిఫలంగా.

మ : నేనూ పెట్టుకున్నానే పదేళ్లు ఆయన్ని..

సా : అయినా రసీదు... పాపాయి, తాతయ్యగదిలో చిలక్కొయ్యని తాళం చెవులుంటాయి తీసుకురావే.

పా : తాతయ్యగదిలోనా!

సా : అవునే! ఎవ్వరూ పీక్కుతినరులే... వెళ్లూ...

(వెళుతుంది)

చ : ఆ కుర్చీ చాలా బావుంది!

మా : అవును. మొన్న వేలంలో చవగ్గావస్తే కొన్నాను.

సా : అందమైనవన్నీ సెకండు హేండ్ షాపుల్లోనే అమ్మతారు.

పా : (భయంతో పరిగెత్తుకుంటూ వచ్చి) అమ్మా! అమ్మా!

సా : ఏమిటే?

పా : తాతయ్య లేస్తున్నాడే!

చ : ఏమిటీ?

సా : ఏమిటే? ఏంజరిగిందే?.

పా : తాతయ్య మంచంమీద నుండి లేచేడే!

మ : పిల్ల దడుసుకుంది.

సా : ఏమిటే పిచ్చిగా మాట్లాడుతావు! తాతయ్య చచ్చిపోయేడే! లేవడం ఏమిటే, నీవెర్రి?

పా : లేదే! నేను చూచేనే ఆయన లేవడం.

(అందరికీ ఓసారి భయం ఆవేసిస్తుంది. లేచి నుంచుటారు. సావిత్రి, మాధవరావు చెయ్యిపట్టుకుని)

సా : రండి! చూచివద్దాం.

మ : వెళ్లిరావే!

సా : నువ్వుకూడారా!

చ : మాట్లాడకండి! ఏదోవినస్తోంది...(అందరూ చెవులొగ్గ పెడుతారు. మంచంమీద నుండి లేచి కళ్లితో దగ్గినట్లు శబ్దం. ముసలి రామయ్యపంతులు, పైఖండువా సవరించుకుంటూనే వస్తాడు సావిట్లోకి. దయ్యం అనుకుని భయపడి కళ్లప్పగిస్తారు.)

రామయ్య : (వస్తూనే) ఓహో! చలపతీ! మంగమ్మా! ఎప్పుడు వచ్చేరు! ఏంపనిమీద! అబ్బాయి బావున్నాడా.

(చలపతి దగ్గరగా వెళ్లబోతే పారిపోయి మంగమ్మ వెనకాలవచ్చి నుంచుంటాడు)

సా : నాన్నా! ......... నువ్వేనా?

(దగ్గరకు వచ్చి చెయ్యిమీద పొడుస్తుంది మనిషో కాదో అన్నట్లు)

రా : అవును నేనే. ఏమిటి ఆ పొడవడం? ఏమిటి నీఉద్దేశ్యం ఇల్లా చెయ్యడంలో.

సా : ఆయన చచ్చిపోలేదు.

చ : అల్లాగే అనిపిస్తోందే.

రా : (చిరాకుగా) ఏమిట్రా ఇది? మంగమ్మా! నీకు నన్ను చూడడంలో సంతోష మున్నట్లు లేదే.

మ : మమ్మల్ని ఆశ్చర్యపరిచేవు ఒక్కసారిగా! వంట్లో బావుందా నాన్నా!

రా : ఏమిటీ?

మ : నీ వంట్లో కులాసాగా వుందా?

రా : నాకేం వచ్చింది! కాస్త కడుపు బరువుగా ఉండి తల తిరుగుతుంటే పడుకున్నా, నాకేంవస్తుందే.

మ : అవున్నాన్నా! పూర్వకాలపు వాడివి.

రా : సావిత్రీ! నా చెంగావి పంచె ఏదే!

సా : (తుంగారుగా) ఆదణ్ణెంమీద లేదూ!

రా : కనపడటంలేదే.. ఆ! మాధవరావు. నువ్వు కట్టుకున్నావే!

# కీర్తి శేషులు

మా : మర్చిపోయే! నాదనుకున్నా. ఉండండి. (లోపల్కి పరిగెత్తుతాడు.)

రా : ఈనరసేం బాగోలేదు. చచ్చినాడి సమాధుల మీద తులసి మొక్కలు వెయ్యడం.

పా : తాతయ్యా! నువ్వు చచ్చిపోనందుకు ఎంత సంతోషంగా వుందను కున్నావు? (కాళ్ళదగ్గర కూర్చుంటుంది)

సా : పాపాయి! నోర్మూసుకోవే?

రా : ఏమిటే పాపాయి! ఎవరే చచ్చింది?

సా : (గట్టిగా) పాపాయి మీకు ఒంట్లో బాగో లేనందుకు ఖంగారు పడిపోయింది.

రా : అదా! పిచ్చిపిల్ల పాపాయి, ఇప్పుడు బాగానే ఉందమ్మా!

సా : ఆయనకు పాపాయి అంటే అంతప్రాణం.

మ : మా అబ్బాయి అంటే అన్నమే అక్కరలేదు.

సా : అయితే అడగవే, ఆయన బంగారపు గడియారం మీ అబ్బాయికి ఇస్తానన్నాడేమో!

మ : (చిరాగ్గా) ఇప్పుడేం అడుగుతాం! అయినా.

రా : ఏమిట్రా. అందరూ అల్లాఉన్నారు విచారంగా! ఎవరైనా చచ్చిపోయారా? వార్త వచ్చిందా! (నవ్వుతాడు)

మ : ఎవరూలేదు నాన్నా. ఆయన దూరపు చుట్టం ఒకడు.

రా : దూరపు చుట్టరికం అంటే!

మ : ఆయన వేలువిడచిన పినతండ్రి కొడుకుల్లో ఒకరు.

చ : నాన్‌సెన్సు! నాకు ఎవరూ లేనేలేరు.

రా : పాపం! అయితే చలపతీ! ఆయన పేరేమిటి?

చ : ఎస్...

సా : రామారావు.

మ : శీతాపతి.

చ : రామా... శీతా... ఆనందయ్య.

రా : ఆనందయ్య ఎక్కడ చనిపోయేడు?

చ : బొంబాయిలో.

రా : అయితే ఆయన నీకంటె ఎన్నేళ్లు పెద్ద?

చ : ఐదేళు.

రా : పదోరోజుకు వెళతావా?

చ : ఊఁ!

సా, మ: అబ్బే ఆయన వెళ్ళరు.

చ : అబ్బే వెళ్ళను.

రా : కాస్త కాఫీనీళ్ళు ఇస్తారా? మీరంతా ఇంకా త్రాగ లేదనుకుంటా! నాకోసం కూర్చోలేదుకదా?

సా : అవును. ఇప్పుడే తయారుచేసి తీసుకువస్తా. (వెళ్ళుతుంది)

చ : వయస్సు ముదిరిందికదా! ఆకలి అవీ సరిగ్గా వున్నాయా?

రా : లేకేం, ఉన్నాయి. వాటిదారి వాటిది. కొంచెం బధకంగా వుండి పడుకున్నా.

సా : అయితే నిద్రపోయేరా?

రా : లేదు. అసలు నిద్రపోనేలేదు.

సా, మా, రా : నిద్రపోలేదూ? ఓ!

రా : నిజంగా చెప్పాలంటే ఏం జ్ఞాపకంలేదు. కాని ఒక్కటి ఏదో నుగతగా వచ్చింది. కాళ్ళూ చేతులూ కూడా కదపలేనటువంటి మైకం.

చ : చూపు, వినడంకూడా లేవా?

రా : ప్రత్యేకంగా ఏమైనా చూచినట్లు జ్ఞాపకం లేదే.

సా : మేం పొరపాటుపడ్డామన్నమాట. నిజంగా నువ్వు నిద్ర పోయి వుంటావు.

మ : అక్కయ్య, బావ, నీదగ్గరకు రావటం జ్ఞాపకంవుందా?

రా : ఏమిటిదంతా? ఉండండి జ్ఞాపకం చేసుకోనివ్వండి.

సా : ఆయన్ని బాధపెట్టకండ్రా.

రా : అరి పిడుగుల్లారా! సావిత్రీ, నువ్వూ అతను కలిసి నాసందుగా పెట్టి ఎందుకు తీసుకువెళ్ళేరు?

మ : ఏం సందుగా నాన్నా అది?

రా : అదే! నువ్వు చూడలేదు. మొన్న కొన్నది.

మ : అయితే ఆమూలనున్న దేనా నాన్నా!

రా : అవును. అదే... అదేమిటి నా గోడగడియారంకూడా మారిందే! ఏమిటిదంతా? ఈదొంగతనం?

మ, రా : చచ్చేమురా దేముడా? ఉరేస్తాడా?

మ : దొంగతనంలేదు యేమీలేదు. నే చెపుతాను నాన్నా.

సా : ఊరుకోవే మంగమ్మా!

మ : ఎందుకూరుకోవాలి? యేంతప్పు చేశాననీ?

మా, రా: మంగమ్మా!

మ : నువ్వుకూడానా! నీపెళ్ళాం ఎల్లా చెబితే అల్లా చేసే కీలుబొమ్మవన్నమాట?

సా : యేం మంగమ్మా! ఎక్కడుండి మాట్లాడుతున్నావో మర్చిపోతున్నావా?

మా, రా: ఊరుకోండి. యేమిటీ దెబ్బలాట?

చ : ఎందుకూరుకోవాలి. నాభార్య దానిష్టమొచ్చినట్లు అది మాట్లాడడానికి హక్కువుంది.

సా : అయితే ఆవిడను బయటకువెళ్ళి అరవమనండి; కాని ఇక్కడకాదు.

రా: యేమిటిదంతా! ఎవరూ అసలు సంగతేమిటో చెప్పరేమర్రా!

మ: నే చెపుతాను నాన్నా! ఇల్లా పట్టపగలు నీసామాన్లు అంతా లూటీచెయ్యబడ్డం నేచూడలేను.

రా : ఎవరు లూటీచేసేరు నన్ను?

మ : అక్కయ్య, బావాను. నీ సందుగా నీగడియారం, నీ పంచెలు అన్నీకూడా రాత్రిళ్ళు దొంగతనంగావచ్చే దొంగలాగే దొంగిలించారు. నువ్వు చచ్చిపోయిన తర్వాత.

సా, మా: ఊరుకో మంగమ్మా!

మ : ఎందుకూరుకోవాలి? నువ్వుచచ్చిపోయిన తర్వాత.

రా : ఎవరుచచ్చిపోయిన తర్వాత?

మ : నువ్వు!

రా : నే చచ్చిపోలేదే?

మ : లేదు. కాని వాళ్లనుకున్నారు నువ్వు చచ్చిపోయేవని.

రా : ఓహో! అదా! అందుకా మీ మొఖాలన్నీ ఇట్లా వున్నాయి. పాపం, అది చాలా తప్పయిందే.

సా : నాన్నా!

రా : అయితే నా ఆస్థిఅంతా పంచుకోడాన్కి మీకు ఆట్టేకాలం పట్టలేదన్నమాట!

మ : లేదు నాన్నా! అక్కయ్యే నీసామానంతా.

రా : అయితే సావిత్రీ నీకన్నంతా నామీదనే వుందన్న మాట. నే వ్రాసిన వీలునామా నీకు...

మ, రా: అయితే మీరు విల్లువ్రాసేరా?

రా : వ్రాసేను, బీరువాలో ఉంది.

మ : యేమని వ్రాసేవు నాన్నా?

రా : దాని అవసరం లేనేలేదు. రేపేదాన్ని తగలపెట్టేస్తా.

సా : నామీద కోపమా నాన్నా నీకు?

రా : ఒకళ్లమీద కోపం నాకెందుకు? మీ అమ్మ పోయినప్పటినుండీ కొన్నాళ్ళు నీదగ్గర, కొన్నాళ్ళు మంగమ్మ దగ్గరఉన్నాను. ఈసారి విల్లులో ఎవరిదగ్గర వున్నప్పుడు చచ్చిపోతే వాళ్లదే నా ఆస్థిఅంతా అని వ్రాస్తే బావుంటుందేమో?

మ, రా: ఇది ఓ లాటరీలా ఉంటుంది.

మ : అయితే రేపటినుండి ఎవరిదగ్గరవుంటావు నాన్నా?

రా : అదా, చెపుతా.

మ : నాదగ్గరకొచ్చి చాలా రోజులైంది. రేపు మాతో వచ్చెయ్యి. అక్కడే వుందువుగాని.

సా : అది పనికిరాదు. నీదగ్గర ఉన్నాళ్లలో సగం రోజులైనా నాదగ్గర లేరు. ఎల్లా వస్తారేమిటి.

## కీర్తిశేషులు

మ : దానికేంగాని, ఇవ్వాళ జరిగిన విషయం తర్వాత నీదగ్గర నాన్న ఉండలేడు.

రా : అయితే నన్ను నీదగ్గరకు రమ్మంటావా మంగూ?

మ : తప్పకుండా. నిన్ను సుఖపెట్టడంకంటే నాకేముంది నాన్నా!

రా : అయితే నువ్వేమంటావు సావిత్రీ!

సా : నేనేం చెప్పనూ, మంగమ్మ గత రెండుసంవత్సరాలనుండే మారింది. అయినా మా ఇద్దరిమధ్య తగువుకు కారణం మీకు ఎందుకో తెలుసా?

మ : ఒట్టి వెర్రివెంగళాయిలా మాట్లాడకు.

సా : మాట్లాడటం లేదు. నాన్న నాదగ్గర ఉండకపోతే, నీదగ్గరా ఉండడు. అప్పటి దెబ్బలాటలో "నాకేం నాన్నను కొనైనా ఉంచుకుంటా" అని అన్నావు. నేడు ఆయన్ని ఉంచుకోనేందుకు కొంటున్నాం అంతే తేడా.

రా : అయితే యిద్దరికీ నా యెడల సానుభూతి హృదయపూర్వకమైనది కాదన్నమాట.

సా : నేనేం చేసేనని తప్పు ఒప్పుకోడానికి. చేసినదానికి నే విచారించటం లేదు.

మ : నేనూ అంతే.

రా : అయితే ఇద్దరూ విచారించక్కరలేదు. నేనుండడం ఇద్దరికీ ఇష్టం లేదు.

మ, సా : కాదు నాన్నా అది కాదు.

రా : మీ ఇద్దరికీ అక్కర్లేనప్పుడు ఇంకోచోటికి వెళ్ళాలి నేను.

చ : అదికాదండి! ఎవరిదగ్గరో ఒకరిదగ్గర ఉండాలి మీరు. తప్పకుండా.

రా : అయితే నే చెప్తున్నా నేనేం చేస్తానో. రేపు ఉదయం నేను మూడు పనులు చెయ్యాలి. మొట్టమొదటిది, లాయరు దగ్గరకు వెళ్ళి విల్లు మార్చడం; రెండవది ఇన్సూరెన్సు ప్రిమియం కట్టడం; మూడవది, రిజిస్ట్రారు దగ్గరకువెళ్ళి పెండ్లి చేసుకోవడం.

మ, రా, చ : యేమిటీ!

మ : మళ్ళీ పెళ్ళా?

సా : మతి యేమైనాపోయిందా?

రా : లేదు. మళ్ళీ పెళ్ళి చేసుకుంటున్నా.

సా : ఎవర్ని?

రా : ఎవరా? బంగారమ్మను. హోటలు పెట్టిందే, దాన్ని వివాహం చేసుకుంటున్నా. మేమిద్దరం చాలాకాలం క్రితమే అనుకున్నాం. కాని చెప్పలేదు. ఎల్లాగా నేను మీ అందరికీ బరువుకదా! మరి నా బరువు మోసేందుకు ఎవర్నో అండ చేసుకోవాలికా! అందుకనే రేపు దశమి ఆదివారం నాడు ముహూర్తం. మీరంతా వస్తారుగా! బంగారమ్మతో.... ఆదివారం.....

(లేచి నెమ్మదిగా అడుగులు వేసి బయటకు వెళ్తాడు)

(తెర)



# ★ విద్యుచ్ఛక్తి విశిష్టత ★

• శ్రీ వేమరాజు భానుమూర్తి •

ఈ రోజులలో ఏ బస్తీకి వెళ్ళినా రోడ్డులకు ఇరువైపులా పెద్ద పెద్ద స్తంభాలమీద ఎలెక్ట్రిక్ తీగలు బిగించబడి వుండడం కనబడుతుంది. ఈ తీగలులోనుంచి మన ఇళ్ళకు, కర్మాగారాలకు, పాఠశాలలకు విద్యుచ్ఛక్తి సరఫరా అవుతూ వుంటుంది.

మన చెన్నపట్టణం సంగతే తీసుకుందాం. ఏ కారణం చేతనైనా మనకు విద్యుచ్ఛక్తి సరఫరా నిలిచి పోయిందనుకోండి. అప్పుడేమవుతుందో ఆలోచించారా?

ట్రాములు నడవవు. టెలిఫోనులు పనిచేయవు. రేడియోలు పాడవు. ఎత్తైన భవనాలలో లిఫ్టులు పనిచేయవు. రాత్రి వేళల బజారులో కనిపించే రంగు రంగుల దీపాలుండవు. ఎలెక్ట్రిక్ రిఫ్రిజరేటరులో ఆహార పదార్థాలు నిలవ చేయడానికి లేదు. మోటారులు తిరగడానికి వీలులేదు. కనుక అనేక పరిశ్రమలు పడుకుంటాయి. అప్పుడు మనకు ఇంటా బయటా నూనె దీపాలే గతి అవుతాయి.

విద్యుచ్ఛక్తి తన వశం కావడంతో మానవునికి బోలెడంత పెత్తనం లభించింది. బోలెడంత తీరిక లభించింది. బోలెడంత శక్తి వచ్చినది.

విద్యుచ్ఛక్తి మనకు ఈనాడు గనులను త్రవ్వి పెడుతున్నది. బట్టలు నేసి పెడుతున్నది. దుస్తులు కుట్టి పెడుతున్నది. ఆహార పదార్థాలను బంగీలు కట్టి పెడుతున్నది. రైళ్ళు, ఓడలు, బండ్లు నడుపుతున్నది. బరువులు మోస్తున్నది. పంకాలు త్రిప్పుతున్నది. పరిశ్రమలు నడుపుతున్నది. విద్యుచ్ఛక్తి సాయంతో మనం దేనినైనా ఎక్కడికైనా నడిపించ వచ్చు. దేనినైనా ఎక్కడికైనా కదలకుండా ఆపుచేయవచ్చు. ఏ ఖనిజాన్ని అయినా ఏడువేల ఫారిన్ హీట్ డిగ్రీల వరకు వేడిచేయవచ్చు. లేదా మైనస్ అరవై ఫారన్ హీట్ డిగ్రీల వరకు చల్ల బరచ వచ్చు.

విద్యుచ్ఛక్తి చాలాచౌక కావడంచేత, దాన్ని ఇతర ప్రాంతాలకు సులువుగా తీసుకుని వెళ్ళడానికి వీలుండడం చేత పరిశ్రమలలో ఎన్నో మార్పులు వచ్చాయి. నూరేళ్ళ క్రితం పరిశ్రమాగారాలలో యంత్రాలన్నీ ఆవిరిశక్తి చేత నడుపబడేవి. అందుచేత వాటిని నీరు పుష్కలంగా లభించే చోట పెట్టవలసి వచ్చేది. పైగా వీటి కోసం బోలెడంత బొగ్గు కావలసి వచ్చేది. ఈ బొగ్గును ఎక్కడో గనినుంచి త్రవ్వి తీసుకు రావలసివచ్చేది. ఇప్పుడా తిప్పలేమీ అక్కర లేకుండా విద్యుచ్ఛక్తి సాయంతో అనేకవందల మైళ్ళ దూరంలో అనేక పరిశ్రమలలోని అనేక వేల యంత్రాలను ఏక కాలంలో ఎక్కువ శక్తిమంతంగా నడపడానికి వీలైంది. ఇంక ఫ్యాక్టరీలలో కూడా విద్యుచ్ఛక్తి పుణ్యమా అంటూ మానవులకు పొద్దుగూకులూ రెక్కలు ముక్కలు చేసుకోవలసిన అవసరం తప్పింది. వస్తువుల మంచి చెబ్బరలను నిర్ణయించాలన్నా, లేక వేటికవి విడదీసి వేయాలన్నా, యంత్రాలను నడపాలన్నా, ఆపాలన్నా, ఒకచోట సరుకును మరొకచోటకు మార్చాలన్నా, లేక రేకులకు కన్నాలు వెయ్యాలన్నా, లోహపు ముక్కలను అతకాలన్నా, కొయ్యను కోయాలన్నా, మరేపని చెయ్యాలన్నా విద్యుచ్ఛక్తితో చౌకగా, త్వరగా, సరిగా చేయడానికి వీలుకలిగింది. ఏ పనైనా చేత్తో చేయడం కంటే విద్యుద్యంత్రాలతో చేయడమే ఎక్కువ చౌక, సులువుకదా.

ఇంక ఇంట్లో విద్యుచ్ఛక్తి వినియోగం ఎన్ని రకాలుగా ఉంటుందో లెక్కవేసి చెప్పడం కష్టం. దీపాలు వెలిగించడం, పంకాలు త్రిప్పడం సరేసరి. ఇల్లు తుడవడానికి, శుభ్రం చేయడానికి, వంట చేయడానికి, వస్తువులు కదపడానికి, గిన్నెలు కడగడానికి, బట్టలు ఇస్త్రీ చెయ్యడానికి, కూరగాయలు పదిలం చెయ్యడానికి, కాఫీ గింజలు వగైరా వేయించు కోవడానికి, పొడుం చేసుకోవడానికి, నీళ్ళు

# విద్యుచ్ఛక్తి విశిష్టత

కాచుకోవడానికి, మజ్జిగ చిలకరించుకోడానికి, రేడియో పాడించుకోవడానికి, కుట్టుమిషన్ త్రిప్పడానికి, గదులను వెచ్చగా ఉంచుకోవడానికి, అన్నింటికీ విద్యుచ్ఛక్తి ఉపయోగపడుతున్నది.

ఎయిర్ కండిషనింగ్ ఉన్నచోట గాలిని శుభ్రపరచడానికి, అవసరమైతే వాతావరణాన్ని చల్లబరచడానికి విద్యుచ్ఛక్తి వినియోగపడుతోంది. పెద్ద పెద్ద కార్యాలయాలలో లెక్కలు చేసిపెట్టే యంత్రాలను, టైప్ రైటర్లను, కవరుల ఎడ్రసులు వ్రాసే యంత్రాలను, నడిపించడానికి విద్యుచ్ఛక్తి ఉపయోగపడుతోంది. ఇంక వ్యాపార రంగంలో రంగు రంగుల దీపాలతో జనులను ఆకర్షించడానికి విద్యుచ్ఛక్తి ఏలా ఉపయోగపడుతోందో అందరికీ తెలుసు.

పొలాలలో నీళ్ళు తోడడానికి, పాలు పితకడానికి, పచ్చి పాలనుంచి వెన్నను విడతియ్యడానికి విద్యుచ్ఛక్తి యంత్రాలు ఉపయోగించబడుతున్నాయి.

దూరాన్ని జయించడంలో మన మాటను అతి త్వరిత గతిని అందచేయడంలో ఈనాడు మనకు రేడియో, టెలిఫోన్, టెలిగ్రాఫ్, కేబుల్, టెలివిజన్ అతిప్రధానమైనవి. విద్యుచ్ఛక్తి లేకపోతే ఇందులో ఒక్కటీ పనిచేయదు. సినిమా సంగతి చూడండి. అవసరార్థం రాత్రిని పట్టపగలు చెయ్యడానికి, కెమెరాలు నడపడానికి, ఫిలిములు చూపడానికి, పాటలను గట్టిగా వినిపింపచేయడానికి విద్యుచ్ఛక్తే శరణ్యమవుతున్నది.

బొమ్మలను టెలిగ్రాఫ్ ద్వారా, రేడియో ద్వారా, ఎంత దూరమైనా క్షణాలలో పంపించవచ్చు. వార్తాపత్రిక కార్యాలయంలో టెలిప్రింటర్లు, లైనోటైప్ యంత్రాలు, విం క్లేర్, స్టీరియో యంత్రాలు, రోటరీ యంత్రం విద్యుచ్ఛక్తి లేకపోతే పని చెయ్యడమే కష్టం. ఒకచోట ముద్రించబడిన మరొక వార్తాపత్రికలను రేడియో సెట్టుల సాయంతో ఫేసిమలీ పద్ధతిద్వారా మరొక దూరప్రాంతంలో పూర్తిగా ముద్రిస్తున్నారు.

వైద్యంలో కూడా విద్యుచ్ఛక్తి ఎన్నో మార్పులను తీసుకు వచ్చింది. అనేక రకాల వ్యాధులను కుదర్చడానికి పనికివచ్చే అల్ట్రావైలెట్, "ఇన్‌ఫ్రారెడ్" కిరణాలు విద్యుచ్ఛక్తి సాయంతో ఉత్పత్తి చేయబడుతున్నాయి. "ఎలెక్ట్రో కార్డియోగ్రాఫ్" అనే యంత్రం సాయంతో గుండె పరిస్థితి ఎలావుందో, విద్యుచ్ఛక్తి సాయంతో ఆలోచిస్తున్నప్పుడు మెదడు పరిస్థితిని తెలిపే తరంగాలసాయంతో, మెదడులో వుండే లోపాలను వైద్యులు తెలుసుకోగలుగుతున్నారు. ఒక రకం పిచ్చిని కుదర్చడానికి "ఎలెక్ట్రిక్ షాక్స్" ను ప్రయోగిస్తున్నారు. నెత్తురు కారకుండా ఆపరేషన్ చెయ్యడానికి, "ఎక్స్ కిరణాల" సాయంతో శరీరంలోపలి భాగాలను శోధించి రోగనిదానం చెయ్యడానికి విద్యుచ్ఛక్తి ఉపయోగబడుతోంది.

విద్యుచ్ఛక్తి సమాజ జీవితాన్ని ఎంతగా మార్చివేసింది! ఎప్పుడూ తీరిక లేకుండా సతమతమౌతుండే కార్మికులకు, కర్షకులకు, ఇల్లాండ్రకు విద్యుచ్ఛక్తి వాడకం వల్ల ఎంతో విశ్రాంతి లభిస్తోంది. మరుభూములు సస్యశ్యామలాలయ్యాయి. మారుమూల పల్లెలలో సైతం పరిశ్రమలు వెలిశాయి పూర్వకాలంలో నదీతీరాలవెంట, ఆ తరువాత రైలు మార్గాలవెంట, బస్తీలు వెలిస్తే ఇప్పుడు విద్యుచ్ఛక్తి లైన్ల వెంట కొత్త జనపధాలు బయలు దేరుతున్నాయి. ఒక మాటలో చెప్పాలంటే ఏ దేశం అభివృద్ధికి అయినా విద్యుచ్ఛక్తి అభివృద్ధి చాలా అవసరం. అందుకనే మన దేశంలో కూడా విద్యుచ్ఛక్తి అధికోత్పత్తికి పంచవర్ష ప్రణాళికలలో ఎన్నో ఏర్పాట్లు చేయబడ్డాయి. వీటిల్లో దామోదరలోయ, భాక్రా, మాచ్ ఖండ్, తుంగభద్ర వగైరా నదీలోయల ప్రాజెక్టులు ముఖ్యమైనవి.

విద్యుచ్ఛక్తి లేబరేటరీలలో సాధారణంగా 'బేటరీ' లద్వారా ఉత్పత్తి చేస్తూ వుంటారు. ఈ బేటరీలలో పొడి బేటరీలు ఉన్నాయి. తడి బేటరీలు ఉన్నాయి. ఇందులో ముఖ్యంగా చెప్పదగింది 'వోల్టా' బేటరీ. ఇందులో ఒక రాగిప్లేటు తుత్తునాగం ప్లేటు ఉంటాయి. వీటితో చాలా కొద్దిగా మాత్రమే విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయవచ్చు. అయితే ఇది పరిశ్రమల నిర్వహణకు చాలదు. అందుకోసం బలమైన, 'కరెంటు' ను సృష్టించుకోవడానికి ఇతర పద్ధతులు ఉపయోగించ బడుతున్నాయి. ఇందుకోసం పూర్వం నూనె, ఆవిరితో నడిచే యంత్రాలను ఉపయోగించి 'డైనమో'లను త్రిప్పి

# విద్యుచ్ఛక్తి విశిష్టత

'కరెంటు'ను ఉత్పత్తి చేసేవారు. హాలెండులో గాలికి తిరిగే మరలను ఏర్పాటుచేసి వాటికి రెండోచివర 'డైనమో' ను తగిలించి విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసేవారు. ఇప్పుడు అంత కంటే చౌకగా విద్యుచ్ఛక్తిని భారీప్రమాణంలో ఉత్పత్తి చేయడానికి ఉత్తమ మార్గం నదులకు ఆనకట్టలు కట్టి నీటిని నిలవచేసి, అది ఎత్తు మీదనుంచి పడేటట్టు చేయడం. ఆ నీటి క్రింద గిర్రున తిరిగే ఆకుల చక్రం పెట్టడం, దానికి రెండో చివర 'డైనమో' తగిలించడం సులువైన పద్ధతి.

మనదేశంలో మెట్టూరు ప్రాజెక్టు, మైసూరు శివసముద్ర జలపాతము, ఆంధ్రదేశంలో మాచ్ ఖండ్, తుంగభద్ర ప్రాజెక్టు, ఉత్తరదేశంలో దామోదరలోయ ప్రాజెక్టులు వగైరా అన్నీ ఇలాంటివే.

విద్యుచ్ఛక్తిని భారీప్రమాణంలో ఉత్పత్తి చేయడానికి ఉపయోగపడే 'డైనమో' విశేషం ఏమిటో కాస్త వివరిస్తాను.

ఈ డైనమో యంత్రాన్ని మైకేల్ ఫారడే నిర్మించాడు. ఒక పెద్ద 'మేగ్నెట్' మధ్య ఒక తీగచుట్టను గిర్రున త్రిప్పడంవల్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి వీలుందని ఫేరడే తనప్రయోగాలద్వారా రుజువు చేశాడు.

అలాగే విద్యుత్ప్రవాహాన్ని 'మేగ్నెట్' ధ్రువాలమధ్య నుండే తీగచుట్టలోకి పంపితే ఆ తీగచుట్ట గిర్రున తిరుగుతుందని కూడా రుజువైంది. దీని ఫలితంగా 'ఎలెక్ట్రిక్ మోటారు' నిర్మించబడింది.

ఫేరడే కనిపెట్టిన డైనమో ఫలితంగా విద్యుచ్ఛక్తిని భారీప్రమాణంలో ఉత్పత్తి చేయడానికి వీలైతే, దానిని దేశం ఆర్థికాభివృద్ధికి, పరిశ్రమల అభివృద్ధికి, ఇతరత్రా మానవులకు సుఖం కలిగించడాని మోటారు ఎంతో ఉపయోగపడింది. ఆధునిక నాగరిక సమాజానికి జీవగఱ్ఱ, మానవునికి నమ్మినబంటు అయిన విద్యుచ్ఛక్తి కథఇది.



# ★ నీవు ★

"శ్రీ శిల్పి"

ఈనాటికి సరిగ్గా యిరవై ఏళ్ళ వెనుక నాజీవితంలో మొదటి సారిగా నిన్ను చూచేను. నొసటన కళ్యాణం బొట్టు, బుగ్గన కాటుక చుక్కతో కళ కళ లాడుతున్న నీమొగం మీదనుండి దృష్టి మరల్చుకో లేకపోయాను. ఈజీవితంలో నీవు నాదానవయిపోతున్నావు కదా అన్న ఆనందం నా నర నరాలలోను ప్రాకిపోయింది. నీవు నాదాన వన్న ఆలోచనలో నాహృదయం చిందులు వేసింది. నీ చల్లని పాదం నా జీవిత బాటలో పెట్టగానే. అసంపూర్ణంగావున్న నా జీవితంలో నిండుదనం అలుముకుంది. నీవు నాకు అందించిన మధురిమలో నేను వేయి స్వర్గాలు చూడ గలిగేను. కాని ఆ ప్రేమ స్వరూపాన్ని యే నాడూ పలుకులలో ప్రకటించుకో లేక పోయాను.

నా జీవితంలో వచ్చిన యెన్ని ఒడుదుడుకులని నీమనో బలం అండగా చూచుకొని జయించ గలిగేనో కదా! నీఓర్పులో నాకు నీతి. నీ పలుకులో నాకు జ్ఞానం, నీ అందంలో నాకు వెలుగు. నీ భక్తిలో నాకు మోక్షమార్గం దీపాల్లా కనిపించేయి యిన్నాళ్ళు. నీతో నాలో కాంతి మాసి పోయింది. ఈ చీకటి మయంలో తడుముకుని యెన్నాళు యీ బ్రతుకు బరువు యీడ్వను? ఈ నాడు నన్ను యెదుర్కుంటున్న బరువుల్ని నేనొక్కడినీ భరించలేక కృంగి కృసించి పోతున్నాను. ఆశ నసించిన యీ ఎడారి జీవితంలో నడువలేక అలసి పోయాను. ఇంక ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేను. నాకు ధైర్యం యీ యాలని నీ చివరి చూపులు. మన ప్రేమ చిహ్నంగా మిగిలిన మన బిడ్డల కొరకైనా ధైర్యం వహించమని బోధించిన నీ జాలి చూపులే యింత కాలం నా జీవితాన్ని యీడ్చుకు వచ్చాయి. ఆధైర్యంకూడా నసించిపోయింది. కర్తవ్య హీనుడ నయిపోయినాను. నన్ను క్షమించు.

ఈ నీ సమాధే నాకింక ఆశ్రయం. ఆ నాడు నీతో చెప్పుకోలేని మాటలను యీనాడైనా చెప్పుకోనీయి. ఈ సమాధి గోడలలో నుండి నీచల్లని చూపులు చూడగలుగు తున్నాను. నీతీయని మాటలు వినగలుగు తున్నాను. నా పూలు. దీపారాధన అందుకుని నీవు తృప్తి చెందినట్లు నేను తెలుసుకోగలుగు తున్నాను. నాకీ ప్రపంచంలో ఇంకేమీ వద్దు. నీ సమాధే నాకు శాంతి నిలయం. నీ శాంతి నిలయంలోకి నన్ను కూడ తీసుకో. నీకు నాప్రేమాంజలి యిదే.



# హైదరాబాదు ఆంధ్ర మహిళాసభ

హైదరాబాదు రాష్ట్రములో "ఆంధ్ర మహిళాసభ" భవన నిర్మాణ విషయమై తగిన విరాళాలు సేకరించుటకు గాను, ప్రెసిడెంటు శ్రీమతి అరుణాదేవి, సెక్రటరీ శ్రీమతి ఎన్. కృష్ణకుమారి, శ్రీమతులు డాక్టర్ ఇందిరా దేవి, వై. జయనిర్మలాదేవి, సరస్వతీదేవి, కామలాదేవి, (జూనియర్) బి. ఉమాదేవి, ఇంకా ఆర్గనైజరు శ్రీయుత ఎన్. హనుమంతరావు, శ్రీయుతులు ఆర్. రాధాకృష్ణ మూర్తి, రామచంద్రరావుగారలు మున్నగువారు ఏప్రిల్ మాసములో ఆంధ్రదేశ పర్యటన ప్రారంభించనున్నారు.

వీరు మదరాసులో నాలుగురోజులుండి కొన్ని తెలుగు సంస్థలను దర్శించగలరు. త్యాగరాయ నగరులోనున్న తెలుగు సినిమా నటీనటుల వద్దకూడ తగిన విరాళాలు సేకరించగలరు. తరువాత బెంగుళూరు. నెల్లూరు, తెనాలి, విజయనగరము. రాజమండ్రి, మచిలీపట్టణము, కృష్ణా మరియు గోదావరి జిల్లాలు, తెలంగాణ మొదలుకొని ఇంకా ఎన్నో ముఖ్యపట్టణములు పర్యటించగలరని కార్యదర్శిని శ్రీమతి ఎన్. కృష్ణకుమారిగారు వ్రాస్తున్నారు.

# ★ అంతరాత్మ ★

"సమీర"

రాత్రి తొమ్మిది గంటలవుతుంది. రైలు శరవేగంతో పోతోంది. అందులో ప్రయాణం చేస్తున్న మనుష్యుల సంగతి ఆ రైలు కేమీ పట్టినట్లు లేదు. ఆత్మీయులనుండి విడిపోయామే యన్నట్లు కొందరి ముఖాలు విచారంగా వున్నాయి. విడిపోయిన వారిని కలుసు కుంటున్నామనే ఉత్సాహం కొందరి ముఖాల్లో స్పష్టంగా కనబడుతోంది. కొంతమంది హాయిగా నిద్ర పోతున్నారు. స్త్రీల కంపార్టుమెంటులో కిటికీ దగ్గిర ఒక ముఖం మట్టుకు ఎంతో విచారంగా, దిగులుగా వుంది. అంత రాత్రివేళ, ఒకర్తీ ఎందుకలా కూర్చుని, ఆకాశంవేపు చూస్తుందో ఎవరికీ అవసరం లేనట్టుంది. "నీకు పెళ్ళయిందా? మీ నాన్న కేం పని? అత్త వారిదేవూరు?" అనే ముతక ప్రశ్నలు వేసి మీనాక్షి ప్రాణం విసిగించారే కానీ, ఆ అమ్మాయికి సహాయం చేదామని ఎవరికీ తోచలేదు.

మీనాక్షి ఆకాశం వేపు తదేక దీక్షతో చూస్తోంది. అలా తనెంత సేపటినుంచీ చూస్తోందో! ఆ ఆకాశం తన బాధలకీ, ప్రశ్నలకీ, హృదయంలో మండి పోతున్న ఆవేదనకీ జవాబివ్వటం లేదు. ఎవరు మట్టుకు యివ్వగలరు? తన పిచ్చికాకపోతే, ఎవరైనా తన కష్టాలని అర్థం చేసుకొని, సుఖాన్నందివ్వగలరని ఆశ పడటమేమిటి? తను ఏన్నో కలలు కంది. ఎన్నో ఆశా సౌధాలు నిర్మించుకుంది. జీవితం ఎప్పుడూ ఓ లాగే సాఫీగా నడిచిపోతుంది అని అపోహ పడింది. జరిగిన సంగతులన్నీ ఒక్కొక్కటే తలుచుకుంటూంటే హృదయం తరుక్కు పోతుంది.

ఆ మేడా, ఆతోటా, ఆ ఆనందం మళ్ళీరావు. జీవితంలోని మాధుర్యమంతా ఆ రోజుల్లోనే అంతమయిపోయింది. చదువుకునే రోజుల్లో తనకెంతో మంది స్నేహితులుండే వాళ్ళు. తన స్నేహం కోసం ఉబలాటపడే ప్రతివాళ్ళనీ చూస్తే ఎంతో నవ్వొచ్చేది. తను వెక్కిరించని వాళ్ళు లేరు. వంకలు పెట్టని వాళ్ళు లేరు. వడిన పువ్వులెక్కువ పెట్టుకుని, తనకి తక్కువ యిచ్చిందని గంటసేపు పోట్లాడేది. ఇప్పుడు ఆ పువ్వులంటేనే తనకి పరమ అసహ్యం.

అమ్మకి తన చదువు యిష్టంలేదు. మామయ్య గోపాలం కిచ్చి పెళ్ళిచేయాలని అమ్మకి వుండేది. గోపాలం అంటే తనకి మొదటినుంచీ చులకన. చదువూ, ఉద్యోగమూ రెండూ లేని వాడు ఒక పల్లెటూరి రైతు అనుకునేది. మనిషిలో వుండే సంస్కారానికీ, చదువూ, వుద్యోగమూ, హోదాలకీ ఎటువంటి సంబంధమూ లేదని తనకిప్పుడిప్పుడే అర్థమవుతోంది.

రవిని తనకి మొదట పరిచయం చేసింది గోపాలం. అతను ఉద్యోగస్థుడు, ఆస్తిపరుడు, అందగాడు. గోపాలం అతని ప్రక్కన ఉత్త అప్రయోజకుడులాగ కనబడే వాడు. రవి ఒక్క నిముషం నెమ్మదిగా వుండడు. అందర్నీ నవ్విస్తూ, సరదాగా వుండే వాడు. అతని పరిచయం తనలో ఎంతో మార్పును తెచ్చింది. తనకి తెలియని ఎన్నో విషయాలని చెప్పేవాడు. ఆరు నెలల్లో రవి తనకి స్నేహమయ్యాడు. అతనిమీద తనకి మోజు రోజు రోజుకీ ఎక్కువయింది.

రవి తనని వివాహం చేసుకోనంటాడేమోననే అనుమానమే రాలేదు. తను లేకపోతే అతనికి జీవితంలో మరో ఆనందం లేదేమో ననిపించేది. ఆ రోజుల్లో తన గర్వానికీ, అహంకారానికీ అంతులేదు. గోపాలం ఓ మనిషి కింద యింట్లో వున్న సంగతే మరచి పోయింది. ఒక్కసారైనా గోపాలం తను అందంగా వుందన్న మాపాన పోలేదు. రవి ఆ ముక్కనే రోజుకి పదిసార్లనే వాడు. వాళ్ళిద్దరిలో కనబడిన భేదమే రవి పక్కకి తన దృష్టిని తిప్పింది.

రవి లండను వెళుతున్నాడని తెలియగానే ఎంతో సంబరపడింది. అది తన భావిజీవితానికి మంచి పునాది యనుకుంది. రెండేళ్ళలో తిరిగి వస్తాననీ, రాగానే వివాహం చేసుకుంటాననీ, చేతిలో చెయ్యివేసి చెప్పాడు. ఆమాటల్ని తను ఎంతో అమాయకంగా నమ్మింది.

రెండేళ్ళూ ఎప్పుడయి పోతాయాయని నిముషాలూ, ఘడియలూ లెక్కపెట్టుకుంటూ కూర్చుంది. ఈ లోపల గోపాలాన్ని చేసుకోమనే అమ్మపోరు ఎక్కువయింది. తను ససేమీరా వీలు కాదంది. గోపాలంకి వేరే పెళ్ళయింది.

రోజులన్నీ ఒక లాగుండవు. తన కుటుంబ పరిస్థితులు మారాయి. నాన్నకి టి. బి. వచ్చి వుద్యోగం మానేయవలసి వచ్చింది. పెద్దక్కయ్య మొగుడు కమ్యూనిస్టులలో చేరి జైలుకి వెళ్ళాడు. వాళ్ళ సంసారమంతా యింట్లో దిగారు. తమ్ముడు చదువు మానేసి గుమాస్తా పనిలో చేరాడు. వాడు కాలేజి మానేసిన రోజున ఎంతో దుఃఖించాడు. ఆరోజు నాన్నగారు అనుభవించిన బాధ యింతా అంతా కాదు. సంసార భార మంతా అన్నయ్య నెత్తిన పడింది. వదిన విసుక్కోవటం, అన్నయ్య ఆమెచేతిలో కీలుబొమ్మవటం, వాళ్ళకష్టాలని మరింత ఎక్కువ చేశాయి. ఆ జీవితం తనకి దుర్భర మయిపోయింది. నాన్న మంచం దగ్గిర కూర్చుని అమ్మ ఏడవటం చూస్తుంటే తన హృదయం కొట్టుకునేది.

అన్నయ్యకీ, తమ్ముడికీ పెద్ద పోట్లాటలు జరిగేవి. వున్న కాస్త ఆస్తీ అమ్మేసి వ్యాపారం చేస్తానని తమ్ముడు పంతం పట్టాడు. చిన్నవాడు వాడికేం తెలుసు? దివాలా తీశాడు. అమ్మకీ, నాన్నకీ ముఖం చూపించటం యిష్టం లేక వాడు బొంబాయి పారిపోయేడు. అసలే కష్టాలతో కృంగిపోతున్న ఆ సంసారానికి, వాడిని వెదికి తెచ్చుకునే శక్తి లేకపోయింది. వదిన మరీ అమ్మనీ, తననీ పురుగుల కింద చూడటం ప్రారంభించింది. డబ్బులేకి అవస్థ పడుతున్న వాళ్ళకి సహాయం చేయటానికీ, కనీసం సానుభూతి చూపించటానికైనా ఎవ్వరూ రాలేదు. బంధువులు! బంధువులంటారు! డబ్బు ఉన్నప్పుడే ఎవరైనా దగ్గిరికి చేరేది. అది లేనప్పుడు వాళ్ల మోహం ఎవ్వరూ చూడలేరు.

అమ్మకి దరిద్రంతో పాటు తన సంగతి బెంగపట్టుకుంది. "ఏమో! అతను లండను వెళ్లాడు! మన గతి అధోగతి అయింది" అని వాపోయేది. కానీ అతను వ్రాసే ఉత్తరాలూ, చేసిన బాసలూ తనకి ధైర్యాన్నిచ్చాయి. పిచ్చిది! మొగవాళ్ళు ఎంతో సులభంగా అబద్ధాలాడుతారనీ మనస్సు మార్చుకుంటారనీ, తెలుసుకోలేక పోయింది.

రవి బస్తీనుంచి వచ్చాడని తెలిసింది. తనకు తెలియ బరచకుండా ఎందుకు వచ్చాడా అని తెల్లబోయింది. రెండు వారాలయింది. అతను తన యింటికి రానేలేదు. తన హృదయంలో పెద్ద తుపాను బయలుదేరింది. ఇంట్లో అందరూ తనవంక అనుమానంగా చూస్తున్నట్లు, గుసగుసలు చెప్పుకుంటున్నట్లు అనుమానం వేసింది. బహుశా అది తన వూహేయేమోనని వూరుకుంది.

రవిని మరచిపోదామని నిశ్చయించుకుంది. కానీ, ఓ రోజు హటాత్తుగా యింటికొచ్చాడు. నాన్న టి. బి. సంగతి ఎంతో శ్రద్ధతో కనుక్కున్నాడు. అమ్మ అమాయికంగా అడిగిన ప్రశ్నలకి తను లండనులో చూచి వచ్చిన వింతలనీ, ఆఫీసర్లహోదానీ, గర్వంగా చెప్పుకుపోయాడు. అసలే దారిద్ర్యంతో కుమిలి పోతున్న తన కుటుంబానికి, అతని మాటలు ఎటువంటి ఆనందాన్నీ యివ్వలేకపోయాయి. అతను తనతో ఒక మంచి మాటైనా అనలేదు. ఎంతసేపూ తన గొప్పనీ, డబ్బు విలువనీ వర్ణించాడు. రవిని సాగనంపటానికి గుమ్మం వరకూ వెళ్ళింది తను. "మీనాక్షీ! చాలా మారిపోయావే!" అని నవ్వుతూ శెలవు తీసుకుని వెళ్ళిపోయేడు.

ఆముక్క వినగానే, లోపలకెళ్ళి, పెట్టిలోంచి అద్దం తీసి ముఖం చూచుకుంది. ఆదే మొదటిసారి తన ముఖం పరిశీలనగా చూచుకోవటం. అవును! అతను అన్నది నిజమే! తన మొహం చాలా మారిపోయింది. జుట్టు వూడిపోయి పల్చబడింది. సరి అయిన పోషణ లేక ముఖం పాలిపోయింది. చిక్కిపోయింది. వెట్టి చాకిరీ చేసి చేతులు మొద్దుబారినాయ్. తనకి ఏడుపొచ్చింది. దారిద్ర్యపు పోరాటంలో అందం సంగతే మరిచిపోయింది. అయినా! తిండికే అవస్థపడే పేదవాళ్ళకి అందం సంగతి ఎలా పడుతుంది? పెట్టెమీద పడుకుని ఏడుస్తున్న తనని అమ్మ ఓదార్చింది.

నెల రోజులయింది. రవి మాట ఎవరూ ఎత్తలేదు. ఉప్పుకీ, చింతపండుకీ ఇరుగు పొరుగిళ్ళకి అప్పుకి వెళ్ళవలసివచ్చేది తను. ఎన్నడూ గుమ్మంకదలని తను వెచ్చాలు తేవడానికి బజారుకి వెళ్ళేది. రవి యింక తనకళ్ళకి కనుపించకపోవటమే మంచిదనుకుంది. అన్నయ్యకి మంచి ఉద్యోగం అయ్యే అవకాశం వుందనీ, దానికి వకీలుగారి సహాయం కావాలనీ తెలిసింది. వకీలు కూతురు

పద్మ తన స్నేహితురాలు. ఆ సహాయం కోరటానికి తనే పూనుకుంది.

పద్మ యిల్లు చేరుకునేటప్పటికి ఏడుగంటలవుతుంది. అది వానాకాలం. జోరున వాన కురుస్తోంది. తన కాళ్ళకి చెప్పులు లేవు. గొడుగు లేదు. వున్న ఒక్క పువ్వుల చీర తడిసిపోతోంది. పరుగెత్తుకుంటూ పద్మ గుమ్మంలో అడుగుపెట్టింది. పద్మా వాళ్ళమ్మ ఎదురు వచ్చి తన బురదకాళ్ళవంక విసుగ్గా చూస్తూ, పద్మ పైన కూర్చునుందని చెప్పింది.

తన చీర వంకా, కాళ్ళ వంకా ఆవిడ చూపిన అసహ్యాన్ని గుర్తించగానే, వెనక్కి తిరగబోయింది తను. కానీ మంచం మీద వున్న తండ్రీ, దరిద్రంతో విసిగిపోయిన తన కుటుంబపరిస్థితీ జ్ఞప్తికి తెచ్చుకుని పైకి నడిచింది. మేడమీద పద్మ కొందరి స్నేహితులతో కూర్చుని కబుర్లు చెపుతోంది. వాళ్ళ మధ్య తను రవిని గుర్తుపట్టింది. అతని పక్కన ఓ చక్కని అమ్మాయి కూర్చునుంది. గిరజాల జుట్టు, ముఖమల్ రవికా, బెనారెసు పట్టు చీరా, చాలా నాజూకుగా వుంది. రవి ఆ అమ్మాయితో ఎంతో హుషారుగా కబుర్లు చెపుతున్నాడు. ఒకప్పుడు తనని ప్రేమించాననీ, తను లేకపోతే వేరే లోకం లేదనీ చెప్పిన రవి, ఆ అమ్మాయి పక్కన కూర్చునుంటే కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అబ్బ! డబ్బు మనుషుల్ని ఎంతమార్చేస్తుంది! చెడ్డవాళ్ళని మంచి వారుగా అన్యాయాన్ని న్యాయంగా అవినీతిని నీతిగా మార్చి చూపిస్తుంది. అక్కడతను ఒక్క నిమిషం వుండలేక పోయింది. పద్మకి చెప్పదలచినది మర్చిపోయి ఇంటి ముఖం పట్టింది.

వాన యింకా తగ్గలేదు. రోడ్డు దీపాలు ఆ చీకట్లో తనకి దోవ చూపిస్తున్నాయి. తన ముందునుంచే బ్యూకు కార్లో, ఆ అమ్మాయీ, రవీ వెళ్ళిపోయారు. ఆ కారు స్పీడుకి రోడ్డుమీద నీళ్ళు చింది తన చీరనిండా పడ్డాయి. ఆ క్షణంలో రవి మీద తనకి కోపం రాలేదు. తన మీద తనకే అసహ్యం వేసింది దేవుడు తన్నెందుకలా సృష్టించాలి? కొంతమందికి డబ్బునీ, కొంతమందికి పేదరికాన్నీ ఎందుకివ్వాలి? ఆ అమ్మాయికంత అందాన్ని తనకా వికృత స్వరూపాన్ని ఎందుకిచ్చాడు? తనేం పాపం చేసుకుంది? తన ప్రశ్నలకి సమాధానం యిచ్చేదెవరు?

రవికి పెళ్ళి నిశ్చయమయిందని తెలియగానే అందరికీ తన మీద చులకనెక్కువయింది. గోపాలంని వద్దన్నదని అమ్మ దెప్పనిరోజు లేదు. నాన్నకి వున్న బాధలకితోడు, తన సంగతి మరింత బాధ్యతని కల్పించాయి. ఇంతలో తన నడవడి సరిగా లేనందుకు రవి వేరే పెళ్ళిచేసుకుంటున్నాడని పుకారు బయలుదేరింది. ఛీ! తను వ్యభిచారం చేసి డబ్బు గడిస్తోందని ఎంతమంది అన్నారు! అటువంటి పనులు డబ్బున్నవాళ్ళు చేసేవే! డబ్బులేనివాళ్ళని చూస్తే అందరికీ ఎంత చులకన! పెళ్ళి కాకముందు మగవాళ్ళకి ఎంత చరిత్రవున్నా, అది వక అనుభవం క్రింద జమ కడతారు.

మొగుడు చెడ్డవాడయితే నోరు మూసుకుని పడుండాలి. ఆడదానికి సంసారం గొడవ తప్ప మరోటి వుండకూడదు. జీవితంలోవున్న యితర ఆకర్షణలమీదికి ఆమె మనసు పోతే "కులట" అంటారు. అదే మగవాడికయితే కళాసేవనీ, సంఘసేవనీ, ఏవేవో పేర్లు పెడతారు. తను పోస్టాఫీసులో వుద్యోగం చేస్తానంటే. యింట్లో వప్పుకోలేదు. ఆడవాళ్ళకి చదువుకావాలీ, వారు ముందుకురావాలీ అని అందరూ వేదికలెక్కి వుపన్యాసాలిచ్చేవారే! కానీ చదువుకున్న ఆడదాన్ని ఏ మగవాడు గౌరవిస్తున్నాడు? ఇది ఇరవయ్యో శతాబ్దం. సాంఘికంగా, ప్రజలు ముందుకు పోయామంటున్నారు. కాని బి. సి. నాటి ఆదర్శాలూ, అభిప్రాయాలూ ప్రజలలో ఇంకా పోలేదు.

రవి తన్ని కాదన్న మాత్రాన లోకం తన్నెందుకు అనుమానించాలి? పద్దెనిమిదేళ్లు నిండినా తన జీవితం ఎప్పుడో అంతమయిపోయినట్లయింది. జీవితంలో తను ఆనందించవలసింది యింకేమిలేదు. అమ్మకీ, నాన్నకీ తను బరువయిపోయింది. బుర్రమీసాలవాళ్ళూ, రెండోపెళ్ళి ముసలి తాతలూ రోజూ తనని చూసి పోతున్నారు. తన చుట్టూవున్న వాళ్ళమీద అసహ్యం, అనుమానం ఎక్కువయ్యాయి.

దేవుడు మనుష్యుల్ని సృష్టించి, ఈలోకంలో పారేస్తాడు. వాళ్ళ కష్టసుఖాలతో అతనికి పనిలేదు. అంతటితో అతని పని పూర్తయింది. తనకి జీవితంమీద విరక్తి కలిగి ప్రాణం తీసుకోవాలంటే ఒకరికి భయపడడమెందుకు? చచ్చిపోతే ఒక ఆర్నెల్లు తను జ్ఞాపకమొచ్చి ఏడుస్తారు, తరువాత మరచిపోతారు. ఈ ప్రపంచంలో ఎంతమంది.

చచ్చిపోవటంలేదూ! వాళ్ళందరినీ మనుషులు ఎంత సులభంగా మరచిపోవటం తను చూడలేదూ! ఈవేగంలో పోతున్న రైలుకింద పడిపోతే! ఛీ! ఏకాలో చెయ్యో విరుగుతుంది! ఆజన్మాంతమూ బాధ. అమ్మా నాన్న ఇంకా బెంగపెట్టుకుంటారు. రైలు కింద పడిపోతే తప్పకుండా ప్రాణం పోతుంది" అనుకుంటూ మీనాక్షి చేతుల్లో ముఖం దాచుకుని ఏడవడం ప్రారంభించింది. అలా ఎంత సేపు ఏడ్చిందో ఆమెకే తెలియదు.

రైలు ఒక స్టేషను దగ్గిర ఆగింది. మీనాక్షి అక్కడ దిగి రైలుకింద పడడానికి నిశ్చయించుకుంది. గబగబా తలుపు దగ్గిరకెళ్ళింది. ఇంతలో ఎవరో బుజంమీద చెయ్యి వేసి వెనక్కి లాగారు. ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూసింది. ఎవరో అమ్మాయి తనలాగే వుంది. తన జుట్టే! తన చేతులే! ముఖం మటుకు కళకళ లాడుతోంది. ఆ అమ్మాయి మీనాక్షిని తీసుకెళ్ళి బెంచీమీద కూర్చోబెటి, ఆమెకెదురుగా కూర్చుంది. ఆ పిల్లని చూస్తూంటే అద్దంలో తన ప్రతిబింబాన్ని చూచుకున్నట్లే వుంది మీనాక్షికి. ఆ అమ్మాయిని ఎన్నో ప్రశ్నలు వేయాలని ముందుకు వంగింది.

"ఏమిటీ ఆత్మహత్య చేసుకుంటున్నావు? పిరికిదానా?" అని ఆపిల్ల పకపకా నవ్వటం ప్రారంభించింది. మీనాక్షికేం తోచలేదు తెల్లబోయి చూస్తోంది. కాసేపటికి ఆ పిల్ల నవ్వడం మానేసి యిలా చెప్పింది. "నేనే నీ పరిస్థితులలో వుంటే రవిలాంటి వాడు నాకు భర్త కానందుకు ఎంతో సంతోషించేదాన్ని. నా అదృష్టంవల్లే ఆ చపలుడితో నాకు సంబంధం తెగిపోయిందని దేవునికో నమస్కారం చేసేదాన్ని. జీవితంలో ఈ కాస్త దెబ్బ తినగానే యిటువంటి పనికి పూనుకోవటం వట్టి అవివేకం. నీలాంటి వాళ్ళకి జీవితం మీద త్వరగా విరక్తికలగటానికి తగిన కారణాలు లేకపోలేదు. పుస్తకాల్లోల్లాగ, సినిమాల్లోల్లాగ జీవితం సాఫీగా నడిచిపోవాలని మీకోరిక. ఒకవేళ ప్రేమించిన వాడు వెళ్ళిపోయినా, చివరికి పశ్చాత్తాపపడి క్షమాపణ వేడుకోవాలి. నిత్యజీవితానికీ, ఊహా ప్రపంచానికీ చాలా తేడా వుంది. ఆవిషయం నీవు తెలుసుకున్న రోజున నీకీ పిచ్చి పిచ్చి అభిప్రాయాలు కలగవు.

"నీవు బీదదానివని ఎందుకలా చింతిస్తావు. పేదరికమేమంత సిగ్గుపడవలసిన విషయంకాదే! నీకు డబ్బు లేదు కదాయని, డబ్బున్న వాళ్ళందరినీ దుమ్మెత్తిపోయడం న్యాయమేనా? అందరూ నిన్ను అవమాన పరుస్తున్నారు, చులకనగా చూస్తున్నారు అన్నది నీమనోదౌర్బల్యాన్ని తెలియజేస్తోంది. నీకసలు ఇటువంటి భావాలు కలగటానికి నీలో ఏదో పెద్ద లోపముంది. అందుబాటులోలేని ఆదర్శాలకోసం ప్రాకులాడుతున్నావు. అందరిలాగా జీవించటానికి నువ్వు ప్రయత్నించటం లేదు. ఇతరుల్ని అసహ్యించుకునే స్వభావం ఒక్కసారి అలవరచుకున్నావా నీకు జీవితంలో సుఖమనేదే వుండదు.

"మీ వదినా, స్నేహితులూ, నీ ఆదర్శాలప్రకారం నడుచుకోవడం లేదని కోపం వస్తోంది- పోనీ వాళ్ల కిష్టమైనట్లు నువ్వు ప్రవర్తిస్తున్నావా? వాళ్ళలో వున్న లోపాల్ని అర్థంచేసుకుని, సానుభూతి చూపించగలిగిన నాడే, జీవితపు విలువని నీవు అర్థం చేసుకోగలవు.

"ఆనందమనేది నీలోనే వుంది. అది ఒకళ్లు నీకిస్తారని ఎప్పుడూ అనుకోవద్దు. నీ జీవితాన్ని సుఖమయంగాకానీ, దుఃఖమయంగాకానీ చేసుకోవడం నీలోనే వుంది. ప్రతి వాళ్ళకీ కష్టాలొస్తాయి. నీలాంటి వాళ్ళు ప్రతి చిన్నవిషయాన్ని ఎంతో పెద్దదిగా తీసుకుని బాధపడతారు. నీకంటే యింకా దుర్భరమైన స్థితిలో వున్నవాళ్ళని ఒక్కసారి తలుచుకో! తెల్లారితే ఒక పిడికెడు బియ్యం కోసరం తిరిగే ముష్టివాళ్లు ఎంతమంది కనుపించటంలేదు నీకు. కుంటివాళ్ళూ, గ్రుడ్డివాళ్ళూ ఎంతమంది లేరు ఈ ప్రపంచంలో? వాళ్ళంతా ఏ ఆశతో జీవిస్తున్నారంటావు? నువ్వు తప్ప లోకంలో మిగతా వాళ్ళందరూ సుఖంగా వుంటారని ఎందుకనుకుంటావు?

"ఇక ప్రేమ విషయమంటావా? రవిని మర్చిపోవడానికి ప్రయత్నించు. వీలయినంతవరకు అతన్ని క్షమించు. ఒక్కొక్క పరిస్థితులలో ఒక్కొక్క విధంగా ప్రవర్తిస్తారు మనుష్యులు. వాళ్ళ చుట్టూ వుండే వాతావరణం, కొన్ని ప్రత్యేక పరిస్థితులు వాళ్ళని చెడ్డదారికి లాగుతాయి. ఒక్క రవిని ఆదర్శంగా తీసుకుని నీవు మగజాతినే ద్వేషించటం తప్పు. అతన్ని పెళ్ళిచేసుకోకపోతే నీకు వేరే ప్రపంచమే లేదూ?

"చిన్నప్పటినుంచీ, ముద్దుగా పెంచి, నీమీద ఎన్నో ఆశలు పెట్టుకున్న తల్లిదండ్రుల ప్రేమని అనుమానిస్తు

(తరువాయి 56-వ పేజీలో)



ఋతు, కాల, భావానుగుణంగా రాగాల సృష్టియే భారతీయ గానకళావైశిష్ట్యం. ప్రతి రాగం ఒకభావాన్ని, ఒకకాలాన్ని స్ఫురింప జేస్తుంది. రాగాలకాలం భావస్ఫురణలకు అనుగుణంగా రూపొందించబడిన చిత్రాలు యుగయుగాలనుంచి ప్రచారంలోవున్నవి. అకాల రాగాలాపన గానమాధుర్యాన్ని నశింపజేస్తుంది.

## తేనీరు

రాత్రింబగళ్లలో ఎప్పుడైనా, ఎలాంటి స్థితిలో వున్నా, తేనీరు ఉత్తేజం కలిగిస్తుంది.

# కేదార

ఇది కేదార రాగభావమునకు సాంప్రదాయకమైన చిత్రణ. ఎడబాటుచెంది, సన్యాసివలె మారు వేశము దాల్చిన ఒక ప్రియుని మూర్తీభవింప జేయును ఈ రాగాలాపన. దుఃఖమును, దీనత్వమును, పరితృప్తి చెందని ప్రణయవాంఛను స్ఫురింప జేయు ఈ రాగమును సాయంత్రపు వేళల పాడునప్పుడు, ఆ సంగీతమునకు చంద్రుని గమనముకూడ కుంటువడునందురు.

సెంట్రల్ "టీ" బోర్డువారివల్ల ప్రచురింపబడినది.

CTB 105

# ★ ప్రేమ సమాగం ★

శ్రీమతి అరుణ

నాటకం ప్రారంభించారు. అంతా ఉత్సాహంగా చూస్తున్నారు. నేనూ చూస్తున్నాను.

పక్కనెవరో- నాటకంలోని ప్రేయసీ ప్రియుల ఎడబాటుచూసి కన్నీరు కారుస్తున్నది. ముక్కు ఒక్కమాటు ఎగపీల్చి మళ్ళీ సరైన స్థితిలోకి వచ్చింది.

కొంచెంసేపు గడిచింది. నాచేతిమీద ఏదో బరువు పెట్టినట్లయి, పక్కకు చూశాను. పద్దెనిమిదేళ్ళ యువతి కూర్చుని ఉంది, ఇందాక కన్నీరుకార్చినామే! పాపం! ఆమెకుకూడా ఇలాంటిదేదో అనుభవమై ఉండాలి అనుకుని నాచేతిమీద ఉన్న ఆమె చేతిని తొలగించి, సద్దుకుని కూర్చున్నా. మళ్ళీ కొంచెం సేపయినతరువాత ఆమె నామీద చెయ్యివేసింది. అబ్బ! ఏమిటీగోల! ఎవరిమీదనో ఉన్న విరహబాధను నామీద చూపెట్టి నన్ను చంపేస్తున్నది. కానీ ఆమె మృదు హస్తాన్ని ఈమారు తొలగించలేక పరధ్యానంగా ఉన్నట్లు నటిస్తూ, నాటకం చూస్తున్నా.

క్షణం గడిచింది. సీను అయిపోయింది. మళ్ళీ సీను కోసం అంతా ఎదురు చూస్తున్నారు. హఠాత్తుగా కోమల కంఠం వినిపించింది.

"ఇందాక నాచేతినెందుకు విడిపించుకున్నారు?"

పెంకెగా జవాబిచ్చాను- "అపరిచితుల హస్తాలతో హస్తాలు కలిపి, అందులో ఆడవాళ్ళతో- కూర్చోవటం మాకు అలవాటులేదు."

ఆమె నిశ్చలంగా మళ్ళీ అడిగింది- "అలవాటుంటే తొలగించేవారు కారన్నమాట?"

"ఏమో! అది ఈపరిస్థితిలో చెప్పలేనిది".

"పోని ఇప్పుడు అలవాటైందిగా!"

"లేదు" అన్నా ఆలోచించకుండా.

వచ్చే నవ్వు ఆపుకుంటూ ఆమె అన్నది- "నేను అలవాటు చేస్తాలెండి".

నాకేమీ జవాబు తోచలేదు. మాట్లాడకుండా వాచీ సరి జేసుకుంటూ కూర్చున్నా.

నాటకం అయిపోవచ్చింది. మళ్ళీ నాచేతిమీద చెయ్యి పడ్డది. ఈసారి గట్టిగా నాచేతినికూడా నొక్కింది. క్షణమయాక, నాటకంమీదనే దృష్టి నిలిపి, నాచెవిలో "నేను ఎవర్నో మీకు తెలీదు. కానీ ఒక అపరచితుణ్ణి ప్రేమించి దాని పర్యవసాన మెలా ఉంటుందో ఊహించుకోలేని ఒక అభాగిని ఉందనీ, ఒకనాడు నాటకంలో ఆమెకు అతని పక్కన కూచోగలిగే భాగ్యం లభించిందనీ- క్షణికమైన ఆ ఆనందాన్ని జీవితాంతం వరకూ ఆమె మరిచిపోలేదని మాత్రం జ్ఞాపకముంచుకోండి.—" అన్నది అశ్రుదద్ధ కంఠంతో.

రోజులు గడిచినయ్. ఆమెను నేను పూర్తిగా మరచి పోకపోయినా, మర్చిపోయినవాళ్ళలోనే లెక్క.

సెలవలకు ఊరికెళ్ళటానికి రైలెక్కుతున్నాను. స్టేషన్ మాష్టర్‌తో చిరపరిచితురాలిలా ఎవరో మాట్లాడుతున్నారు. రైలెక్కి, తలుపు దగ్గర సిగరెట్ కాలుస్తూ నుంచున్న నాదృష్టి ఆమెమీద పడింది. ఎక్కడో చూసినముఖం! కాని జ్ఞాపకం రావటంలేదు. హఠాత్తుగా ఆమె నవ్వు ముఖంతో నన్నుచూసి నిశ్చేష్ఠురాలైపోయింది. మాట్లాడుతున్న మాటల్ని ఆపేసింది. ఆమెను నవ్వించిన స్టేషన్ మాష్టర్ తెల్లబోయాడు. చేతిలో ఉన్న పర్సును ఇంకో చేతిలోకి తీసుకుంటూ ఆమె సీరియస్‌గా స్టేషను మాష్టరుతో ఏదో అని నావైపుకు వచ్చింది. కానీ రైలు కదిలిపోయింది. అప్పుడు చూశాను ఆమె ముఖాన్ని! అందమంతే అదే! ముఖం భంగిమ ఒక్కమారుగా మారిపోయింది. కనుకొలుకుల్లో ముత్యాల్లా కన్నీరు నిల్చిఉంది. చివరకు కళ్ళనిండా నీళ్లు నింపుకొని, చైతన్యరహితంగా చేయి ఊపింది నన్నుచూసి. కానీ నేను లక్ష్యపెట్టనట్లూ, నాకు దేనిమీదా మమత లేనట్లూ ముఖం తిప్పేసుకున్నా.

ఇంటికి వెడితే అమ్మ "పెళ్ళి చేసుకోరా నాయనా!" అన్నది. నాకు నిజంగా పెళ్ళిధోరణిలేదు. అందుకని

అమ్మ ఆమాట అన్నప్పుడల్లా ఒక్క నవ్వు నవ్వి వెళ్ళి పోయేవాణ్ణి. నాటకంలో తటస్థపడ్డ ఆయువతి నా ఊహా లోకంలోంచి ఎప్పుడో మాయమైపోయింది.

సెలవలు పూర్తయినయ్. మళ్ళీ మెడ్రాసుకొచ్చాను. రూము తలుపు తెరచేసరికి, పక్కరూములో ఉన్న సహాధ్యాయి శంకరం వచ్చి ఏవో రెండు ఉత్తరాలిచ్చివెళ్ళేడు. అవి జేబులో పెట్టుకుని సామాను లోపల పెట్టించి, తిన్నగా కాఫీహోటలువైపు దారితీశాను. కాఫీ తాగుతూ నిదానంగా జేబులో ఉత్తరాలు తీశాను. మొదటి ఉత్తరంలో విశేషాలేమీలేవు. చిరాగ్గా లోపలపెట్టేశాను. రెండోది తీశాను. చదివి ఆశ్చర్యపోయాను. నేను చెడ్డదారిన పడుతున్నానేమో అనిపించింది.

......................గారికి,

మహాశయా! మీరు ఆదర్శపాత్రులు, రచయితలు. కానీ, ఒక స్త్రీయొక్క నిష్కల్మష ప్రేమను కనుసైగలతో తిరస్కరించేశారు. పోనీలెండి. నాలా ఇంతచిత్రంగా ప్రేమించేవాళ్ళెవరూ ఉండకపోవచ్చు. నేను కులంలోదాన్ని కాదనేమోకదూ మీ భయం? నేనూ ఉత్తమ కులసంజాతనే! మా నాన్న ఒక డాక్టరు, సంస్కారి, కులమత భేదాల్ని మఱచి అంతర్వివాహాలు చేసుకోటం ఆయనకు ఇష్టం. ఆయన అలానే చేశారుకూడా! అందువల్లనే నేను ధైర్యంగా ఒక అపరిచితుడైన రచయితను, అందగాణ్ణి ప్రేమించాను. నాసంగతి మానాన్నగారికి తెలియదు. తెలిస్తే అంగీకరించరనే భయం నాకు లేదు. ఆనాడు నాటకంలో మిమ్మల్ని చూసి, నాటకం మొదలుపెట్టగానే మీపక్కకొచ్చి కూర్చున్నాను.

"నేను మీకెలా తెలుసు?" అని మీరడగవచ్చు. కానీ ఏముంది అందులో? అందరికీ అందరూ ఎలా పరిచయమౌతారో అలానే నేను మీకు పరిచయమైనాను. అంతకంటే చెప్పుకోదగ్గ విశేషమేమీ లేదు. ప్రేమ భగ్నానికి దారితీస్తుందనే ప్రస్తుతపు నా నిర్ణయం. మీకు కష్టం కలిగించుతున్నట్లయితే ఈ ప్రసక్తిని ఇంతటితో ఆపేస్తాను. కానీ ఆనాడు నాటకంలో ఎంతో ప్రయత్నంమీద మీకు చెప్పగలిగిన ఆ నామాటల్ని మఱచిపోకండి. నన్ను మఱచిపోయినా, కనీసం ఒక ఊరు, పేరు లేని యువతి 'వాక్కులు' అని అయినా స్మరించుకోండి. బ్రహ్మచారిణినై బతకగల ధైర్యం నాకుంది. క్షమించండి. ఇంక నేనేమీ వ్రాయదల్చుకోలేదు. అంతా నాలోనే ఇముడ్చుకుని, శివుడు గరళాన్ని మింగి కంఠంలో దాచుకున్నట్లు, నేనూ నా బాధనంతా కడుపులో దాచుకోగలను. ఇదికూడా రాయకూడదనే అనుకున్నాను. కానీ కలం అప్రయత్నంగా ఇంతవరకూ నడిచింది. అర్థంలేని ఈ లేఖను చదివి తిరస్కార సూచకంగా నవ్వుకుంటారనుకుంటాను. మరి సెలవు.

.........................

ఉత్తరం చదవటమైపోయింది. ఆక్షణంలో నేను అమితంగా బాధపడ్డమాట నిజమే! నాలో ఇప్పుడే వెళ్ళి ఆమెతో "నీకు చాలా అన్యాయం చేశాను" అని చెప్పి ఆమెనే అర్థాంగినిగా స్వీకరించుదామనుకున్నాను. కానీ ఎక్కడికని వెళ్ళను? ఏమని తిరగను? ఆమె ఎడ్రెస్సన్నా ఇవ్వలేదు. దాంతో ఆనాడు పిచ్చివాడికిమల్లే అంతా తిరిగాను ఆమె ఎక్కడైనా కనిపిస్తుందేమోనని. కానీ ఏమీ జాడలేదు.

ఎండాకాలం వచ్చింది. సెలవలిచ్చారు. ఊరికి బయల్దేరాను. రైలెక్కుతూ మళ్ళీ ఆస్టేషన్ మాష్టర్ వైపు చూశాను. ఇప్పుడాయన ప్రక్కన ఎవ్వరూలేరు. ఆయన ఎవరినీ నవ్వించటంలేదు. సీరియస్‌గా టిక్కెట్లు కలెక్టు చేస్తున్నాడు.

ఊరికెళ్ళేసరికి అమ్మ ఒక సంబంధాన్ని తెచ్చింది. నాతో చెప్తే ఇక లాభంలేదనుకొని తనే ఒకటి స్థిరపరిచింది. ఇది విన్నాక నేను మనసులో ఆమెనుగూర్చి కొంచెం చింతపడ్డాను. కాని పిల్లను చూచినతర్వాత అది కాస్తా ఎటో పోయింది. మళ్లీ "అమ్మతో చెప్పి ఆమెను చేసుకుంటే మాత్రం ఏం? ఏకైక పుత్రుడిమీద ప్రేమవల్ల అంతమాత్రానికైనా ఒప్పుకోదా?" అనుకున్నా. కానీ మరుక్షణమే నాలో ఏదో శక్తి "ఛీ! ఎవరో ముక్కూ మొహమూ ఎరుగనివాళ్లు, ఏదో ప్రేమించేశారని పిచ్చిగా నమ్ముతావా?" అని నన్ను అణచేసింది.

అమ్మ సంతోషంగా చూస్తున్నది. పెళ్ళి బాజాలు మోగుతున్నయ్. అంతా హడావిడిగా ఉంది. పురోహితుడు మంత్రాలు చదువుతున్నాడు. మంగళసూత్రం కడుతున్నాను వధువుమెళ్ళో. మంగళసూత్రాన్ని పూజచేసి కూర్చున్నాను. ఏదో హస్తం దీవిస్తున్నట్లూ, మొహం వికసించి లక్ష్మీదేవిలా ఉంది, చిరునవ్వుతో "నాప్రేమను విశ్వసించలేముకదూ? పోనీ... ఇదిగో మీయిద్దరికీ నా శుభాకాంక్షలు!" అని ఆదేశిస్తున్నట్లు తోచింది. ఉన్నట్లుండి కళ్ళు చెమ్మగిల్లినయ్.

—★—

* నాది నాది నాది *




* నాది నాది నాది *

# అమృతాంజనము

గాని,

" యథాయథా.................రాశీభవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగు చున్నప్పుడెల్లను నా, నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

---

#  వెలుగు నీడలు. 

శ్రీమతి జయంతి కామేశ్వరి.

రైలు హరిద్వారం విడిచిపెట్టింది. ఇంకా స్పీడు అందుకోలేదు. భానుమూర్తి కిటికీలోంచి బయటకు తొంగి చూస్తున్నాడు. రైలుదారిప్రక్కనున్న భూమి, తెలుపు నలుపు, తెలుపు నలుపుగా వెనక్కి పరుగెత్తుతోంది. ఆ రైలుపెట్టెలో మాత్రం జనం ఇసకవేస్తే రాలకుండావున్నారు. గుమ్మందగ్గర పెట్టెలూ, బెడ్డింగులూ, మూటలూ ఇంకా ఏవేవో ఎవరివో పోల్చుకోలేని స్థితిలో పేర్చబడివున్నాయి. వాటి సందుల్లోనే కాళ్ళిరికించి కూర్చున్నవాళ్లూ, కూర్చున్న వాళ్ల బుజాల కానుకుని నిలుచున్నవాళ్లూను. ఏదో డెహ్రాడూనులో గంటన్నర ముందొచ్చి పైబెర్తుమీద పక్క పరుచుకోబట్టిగాని లేకుంటే తనకీ అదేగతి పట్టును. ఏది ఏమైనా నిలబెట్టో కూర్చోబెట్టో ప్రతీవాళ్లూ తమ తమ శరీరాల్ని గమ్యస్థానం చేర్చుకోవాలి గదా! కోటిమందికీ కోటి పనులు. అందులో తనదొకటి. భానుమూర్తి మెల్లగా జోళ్లు విప్పుకుని పై బెర్తుమీది కెగిరేడు. అతడు విడచిన సీటులో అమాంతంగా యిద్దరు కూలబడ్డారు. భానుమూర్తి పైన వెల్లకిలా పడుకుని టైముచూసేడు. ఇంకా తొమ్మిదే. ఎప్పుడు తెల్లారుతుంది, ఎప్పుడు ఢిల్లీ వస్తుందని అతనిలో ఒకటే తహతహ. సూక్ష్మంగా చెప్పాలంటే అతని మనస్సు అంతకుముందే ఢిల్లీస్టేషను చేరుకుని శరీరాని కెదురు చూస్తోంది. భానుమూర్తి న్యూసుపేపరు తీసి మొహానికి అడ్డంగా పెట్టుకుని కళ్లు మూసేడు. రైలు స్పీడు అందుకుని ఇటూ అటూ వూగుతూ పోతూంది. భానుమూర్తికి నిద్రపట్టలేదుగాని, ఆవూపులో, ఆజోరులో కాస్త శరీరం మత్తెక్కి మగతకన్ను పడ్డమాట మాత్రం వాస్తవం.

భానుమూర్తి డెహ్రాడూనులో ఉద్యోగం చేసుకుంటున్నాడు. నెలకీ రెండువందల జీతం. దానిలో వంద రూపాయలతో తాను గడుపుకొని మిగతాది కోనసీమలో వున్న తన భార్యకి పంపిస్తుంటాడు. ఈమధ్యదాకా ఆమె కూడ డెహ్రాడూనులోనే వుందిగాని, ఆరునెలలక్రితం చెల్లెలి పెళ్లికి పుట్టింటికి వెళ్లి ఇంకా అక్కడే వుంటూంది. భానుమూర్తి ఆంధ్రదేశాన్ని విడిచి సుమారు మూడేళ్లయింది. ఇంతలో అక్కడ ఎన్నో ముఖ్యవిషయాలు గడిచిపోయాయి. అన్నిటికంటే ముఖ్యం అతని మరదలు జానకి పెళ్లి. ఒకనాడు తనతో ఆడుతూ పాడుతూ చిలిపిచేష్టలు చేసే జానకి పెద్దదై ఈనాడు అత్తింటికి వెళ్లిపోయింది. ఆమె అత్తవారు లక్షాధికారులట. ఢిల్లీలోనే వాళ్లకి మూడు మేడలున్నాయట. ఆఖరికి జానకి పెళ్లికికూడా తాను కోనసీమకి వెళ్ళలేకపోయాడు. తానూ నొచ్చుకున్నాడు. కాని ఏం లాభం? ఆఫీసువాళ్లకి చీమకుట్టలేదు. వారు శలవియ్యలేదు. కనుక ఎల్లాగో భార్యనిమాత్రం పంపించి వూరుకున్నాడు పెళ్లికి. ఆతర్వాత జానకి అత్తారింటికి ఢిల్లీ వచ్చిందంటే సంతోషించి ఈనాటికి మూడురోజులు శలవు వస్తే ఆమెను చూడాలని బయలుదేరేడు భానుమూర్తి. ఈపాటికి తనవుత్తరం వాళ్లకి చేరివుంటుంది. ఉదయం భార్యాసమేతుడై తోడల్లుడు స్టేషనుకు వస్తాడు. జానకి తాను గుర్తుపట్టలేనంతగా మారిపోయి వుంటుంది. రత్నాల హారం, రేడియోగాజులూ, వజ్రాల ముక్కుపుడక, నీలాల కమ్మలూ ఇవన్నీ పెళ్లిలోనే పెట్టేరట జానకికి. ఈ లిష్టంతా తన భార్య రాసిపంపింది. ఇందులో వొక్కటైనా తన భార్యకి పెట్టలేక పోయానుగదా అని బాధపడ్డాడు భానుమూర్తి. అయితేనేం జానకి పెట్టుకుంటేమట్టుకు తనకి సంతోషంకాదూ!! ఒకవేళ జానకి తన అత్తవారి సౌభాగ్యంలో వెయ్యోవంతు చెయ్యని తనను చూసి పరిహసించదు గదా? పాపం ఆమె అల్లాంటిదికాదు. తాను చిన్ననాటి నుంచీ ఆమె నెరుగును. తన పెళ్లి అయిన క్రొత్తలో తన భార్యతోబాటు ఆమెకీ పకోడీల పొట్లాలు తెచ్చి యిస్తుండేవాడు. వేయించిన వేరుశనగకాయలు ముందుపోసుకుని ముగ్గురు గోదావరిగట్టున వెన్నెలరాత్రుల్లో కథలు చెప్పుకొనేవారు. ఇప్పుడనకూడదుగాని ఒకనాడు తన స్నేహితుడు "నువ్వు పెళ్లాడినది పెద్దామెనా చిన్నామెనా" అని అడిగేడు జానకి యెదుట. తాను నవ్వుతూ. "ఇద్దర్నీ అనుకో" అన్నాడు. అది విని జానకి "ఫో బావా" అంటూ వాలు జడతో చెళ్లున కొట్టింది.

కాకులు కూస్తున్నాయి. భానుమూర్తి లేచి, బెడ్డుచుట్టేసి క్రిందికి దిగేడు. చీకటి గుహని చీల్చుకుని రైలు వెలు

తురుకేసి పరుగెడుతోంది. ఆ పెట్టెలో చాలాభాగం ఖాళీ అయిపోయింది. రాత్రి కనుపించిన మొహాలు చాలావరకు దారిలో దిగిపోయాయి. ఇప్పటికే వాళ్లల్లో చాలామంది తమ బంధువులనూ, భార్యలనూ, మరదళ్లనూ కలుసుకుని వుంటారు. భానుమూర్తి మనస్సు ఆందోళన చెందుతోంది. 'జానకిని ఎల్లాగ కలుసుకోవడం, ముందేమి మాట్లాడడమా' అని ఆలోచిస్తున్నాడు. రైలు యమునా నది దాటింది. దూరప్రయాణంచేసి ఆలసిపోయి కాళ్లీడ్చుకుంటూన్న ప్రయాణీకునిలాగ వేగం తగ్గి ప్రాకుతోంది. ఒక్కసారి కూతకూసింది. భానుమూర్తి బయటకు తొంగిచూసేడు. ఢిల్లీ స్టేషను వచ్చేసింది. ప్లాటుఫారంమీద జన సమూహంలో జానకిని పోల్చుకోలేకపోయాడు. "ఉస్ అమ్మయ్యా" అంటూ ఆగింది రైలు. సముద్ర కెరటాల్లా విరుచుకుపడ్డారు జనం రైలుమీద. భానుమూర్తి ఒక మనిషిని పిలిచి సామాను దింపుకున్నాడు. ప్లాటుఫారంమీద ఎంత కలియజూసినా జానకి జాడ కనబడలేదు. జనం చాలాభాగం వెళ్లిపోతున్నారు. ఇంతలో తెల్లకోటూ తెల్ల పంట్లామూ తొడుక్కున్న మనిషి వొకడు భానుమూర్తిని ఎగాదిగా చూసి "మీదేవూరు" అన్నాడు వచ్చీరాని తెలుగులో. "ఏం? మీదేవూరు" అన్నాడు భాను.

"మాదీవూరే. మేమొకరికోసం చూస్తున్నాం. ఆయన పేరు మరచిపోయాను. ఆయన డెహ్రాడూనునుంచి రావాలి" అన్నాడతడు.

"ఏం చిదానందంగారి మనిషివా నువ్వు" అన్నాడు భాను.

"అవును. చిన్నమ్మగారి బావగారు మీరేనా?"

భానుమూర్తి మొహం వికసించి తలవూపేడు "ఔ"నని.

"రండి. బయట కారుంది. నేను వాళ్ల డ్రైవరుని" అంటూ దారి చూపేడతడు.

చక్కని బ్యూకు కారులో మెత్తగా సాగిపోతున్నాడు భానుమూర్తి. దారిలో "అయితే, మీ అయ్యగారూ, అమ్మగారూ రాలేదేం స్టేషనుకి" అన్నాడు భాను.

"వా రెప్పుడూ బయటికి రారండి". డ్రైవరు...... ఇక భానుమూర్తి మాట్లాడలేదు. అతని మెదడునిండా ఆలోచనలూ, గొంతునిండా మాటలూ క్రిక్కిరిసివున్నాయి. అరగంట కాకముందే ఆకారు ఒక మూడంతస్థుల మేడ ముందు ఆగింది. లోనుంచి ఇద్దరు మనుష్యులు వచ్చి సామాను దింపేరు. భానుమూర్తి లోపల అడుగుపెట్టగానే సిలుకులాల్చీ తెల్లని మల్లుపంచతో ఒక యువకుడెదురుగా వచ్చేడు. భానుమూర్తి నమస్కారంచేసి "తమరేనా చిదానందంగారు" అన్నాడు. "నేనుకాదు మాతమ్ముడు. అలా కూర్చోండి" అంటూ ఆయన సోఫాలో కూలబడ్డాడు. భానుమూర్తికూడా కూర్చుని "చాలా సంతోషం ఇప్పటికైనా మీ అందరినీ చూడగలిగేను. ఎంత ప్రయత్నించినా పెళ్లికి రాలేకపోయాను" అన్నాడు. ఆ మాటలు మార్చేసి ఆయన "ఏమిటి డెహ్రాడూను విశేషాలు. ఇప్పుడు మీకు జీతమెంత?" అన్నాడు. భానుమూర్తి కాప్రశ్న నచ్చలేదు. ఎదుటివాని రాబడి నడిగేవానికంటే పశుతుల్యుడుండబోడని అతని అభిప్రాయం. అయినా మన అభిప్రాయాలు ఎల్లవేళలా వెలిబుచ్చడం అసంభవం గనక తన కోపాన్ని దిగమ్రింగుకుని "రెండువందలు" అన్నాడు. "పాపం, మీకావూళ్లో ఏం చాలుతాయి" అని చప్పరించాడాయన. భానుమూర్తి ఒక చిన్న నవ్వుమాత్రం పారేసేడు. ఇంతలో కాఫీ వచ్చింది. ఇద్దరూ పుచ్చుకున్నారు.

"పైకివెళ్లి స్నానం చెయ్యండి" అన్నాడాయన. ఒక మనిషి భానుమూర్తిని రెండో అంతస్థులోవున్న ఒక గదిలోకి తీసుకువెళ్లేడు. ఆ గది చాలా పెద్దది. ఓమూల ఇనుప మంచం, కుర్చీలూ టేబిలూ వున్నాయి. దానిని ఆనుకునే స్నానాలగది వుంది. భానుమూర్తి మెల్లగా దాన్లో ప్రవేశించి స్నానంచేసి బట్టలు మార్చుకుని కూర్చున్నాడు. వెంటనే వెళ్లి జానకిని కలుసుకోవాలని అతని మనస్సు ఆందోళన పడుతోంది. కాని పరిచయంలేని ఆయింట్లో స్వతంత్రంగా ఎల్లానుసలడం? ఇంతలో ఇందాకటి ఆయనే వచ్చి "ఏం బాగుందా మీకిక్కడ?" అన్నాడు.

"బాగానేవుంది. మాతమ్ముడెక్కడ?" అన్నాడు భాను.

"అల్లాగ వీధిలోకి వెళ్ళేడు. మీమరదలు పైనివుంది రండి" అంటూ పైకి తీసుకు వెళ్ళేడు. జానికి బావని చూసి తన బావగారుండడం వల్ల కాస్త సిగ్గుపడింది.

"ఏం బాగున్నావా జానకీ" అన్నాడు బావ.

"బాగానే వున్నాను, నీదయవల్ల" అంది జానకి. అనడమంటే అల్లాగ అంది కాని ఆమెవాలకం చూస్తే ఏమీ బాగున్నట్లులేదు.

తానూహించినటు ముసి ముసి నవ్వులతో ఎదురు రాలేదు. పల్లెటూళ్లో ఎల్లాగ వుండేదో అల్లాగేవుంది గాని తన భార్య రాసిన నగలు గాని, చీని చీనాంబరాలుగాని ఏవీ ధరించలేదు.

"జానకీ ! పట్నం దానివైపోయావు. ఏమిటి ఢిల్లీ విశేషాలు" అన్నాడు భానుమూర్తి.

ఆమె మౌనంగా వెర్రిగా నవ్వి "అక్కా వాళ్ళూ బాగున్నారా" అంది.

"బాగానే వున్నారు." అన్నాడు భానుమూర్తి.

"లేవండి భోంచేద్దాం" అన్నాడు చిదానందం అన్న.

"మా తమ్ముడు గారిని రానివ్వండి ఏకంగా కూర్చుందాం"

"వాడు సాయంత్రం గాని రాడు. పనుండి వెళ్ళేడు"

ఇద్దరూ భోజనానికి కూర్చున్నారు. వంట మనిషి శాక పాకాలు చక్కగా చేసింది. భోంచేస్తూన్నంతసేపూ ఆయన తన వ్యాపారం గురించి దంచేస్తున్నాడు. తల్లి దండ్రులు కాశీ యాత్రకు వెళ్ళేరట- ఒక తమ్ముడు కలకత్తాలో చదువుతున్నాడుట- వాణ్ణి లండన్ పంపించే ఆలోచనలు కూడా వున్నాయట- మిగతా తమ్ములిద్దరూ అంటే చిదానందం మినహా యిక్కడే చదువుకొంటున్నారట. భానుమూర్తి ఊం కొట్టి వింటున్నాడేగాని దేనికీ ఎదురు ప్రశ్నించలేదు.

భోజనానంతరం భానుమూర్తి తన గదిలోకి వచ్చి కాస్త విశ్రమించేడు. జానకి వద్దకి వెళ్ళి ఏదైనా బాతాఖానీ కొడదామనుకున్నాడు గాని ఆమె ఆడవాళ్ళతో కలిసి భోజనానికి కూర్చుంది. తర్వాత తానే వస్తుందేమో నని ఎదురు చూసేడు కాని ఇంతలో కునుకు పట్టింది. సాయంత్రం నాలుగింటికి ఎవరో లేపుతే లేచేడు. ఎదుట బల్లమీద మైసూరుపాకం, పకోడీలు, వెచ్చవెచ్చని తేనీరు పెట్టి ఓ మనిషి వెళ్ళిపోతున్నాడు. అతన్ని అడిగేడు భానుమూర్తి. చిదానందం వచ్చిపైన వున్నాడని తెలిసింది. తానే వెళ్ళి కలుసుకుందామనుకున్నాడుగాని, ఇంతలో ఇందాకటాయన వచ్చి షికారు వెడదాం రమ్మన్నాడు. "చిదానందాన్ని కూడా తీసుకు వెడదా" మన్నాడు భాను మూర్తి. "వాడిప్పుడు రాడు, పైన భార్యా వాడూ వున్నారు" అన్నాడాయన. "పోనీ వాళ్ళిద్దర్నీ రమ్మనండి" అందామనుకున్నాడుగాని ధైర్యం చాలలేదు.

రాత్రి భోజనాలదగ్గర కూర్చునేదాకా చిదానందం మొహం కనపడలేదు భానుమూర్తికి. చిదానందానికీ తనకీ మధ్యగా అన్నగారు కూర్చున్నారు. చిదానందం తెల్లగా బాగున్నాడు మనిషి. అందంలో జానకికి తగిన ఉజ్జీయే. అయితే నేం ఏమంత మాటకారి గాదు.

"మా జానకి మీమాట సరిగా వింటోందా?" అన్నాడు భాను. వంటగది వైపునుంచి తొంగిచూస్తున్న జానకివైపు చూసి. చిదానందం చిన్నగా నవ్వాడు.

"మీరేం చదువుకున్నారు" అన్నాడు భాను. జవాబు లేదు. పెద్దన్న జవాబు చెప్పేడు.

"చదువాబ్బలేదు వీడికి. మా వర్తకంలో పెడదామని యోచన."

ఈమాపైనా చిదానందం తనతో మాట్లాడలేదని కొంచెం బాధపడ్డాడు భానుమూర్తి. ఎలాగైనా మాట్లాడిం చాలని "మీరెప్పుడైనా డెహ్రాడూను వచ్చేరా" అన్నాడు తోడల్లుని మొహంలోకి తొంగిచూసి. అతడు మెల్లగా మౌనంగా నవ్వేడు. "అక్కడ మాకేంపని" అన్నాడు అన్నయ్యే. చిదానందం మౌనం వహించడం భాను మూర్తికి అర్థం కాలేదు. అదేమి గర్వం కాదుగద? భోజ నాలై కుళాయిదగ్గర చేతులు కడుక్కుంటున్నసమయంలో భానుమూర్తి చిదానందాన్ని మళ్ళీ పలకరించేడు.

"మామగారి దగ్గరనుంచి ఉత్తరాలు వస్తున్నాయా?" చిదానందం మాట్లాడలేదుగాని అతని చిన్నతమ్ముడు పన్నెండేళ్ళవాడు ఇలాగన్నాడు "వాడికి మాటలు రావు." భానుమూర్తి నిర్ఘాంతపోయాడు. ఆమేడ మూడంతస్థులతోబాటు తల్లక్రిందులయిపోతే బాగుండుననిపించింది.

ఆరాత్రి భానుమూర్తికి నిద్రపట్టలేదు. ఆగదిలో తా నొక్కడేగాని తన మనస్సులో వేలాది ప్రజలు. వీళ్ళందరూ జానకి బ్రతుకు భగ్నం చేసేరు. మూగి మొగుడుతో కాలం గడుపుకోమని శాసించేరు. ఆమె మొహంలో ఉత్సాహం ఎందుకు కనపడలేదో ఇప్పుడర్థమయిందతనికి. ఏడ్చి ఏడ్చి గుండెని రాయిగా చేసుకుని బ్రతుకుతోంది జానకి. అల్లునికి తిండివుండడ మొక్కటే ప్రధానమనుకున్న మామగారు రాక్షసుడనుకున్నాడు. అసలు విషయం తనకెన్నడూ

రాయనందుకు భార్యమీదకూడా కోపం కలిగింది భాను మూర్తికి. ఇంకా ఆలోచించేడు. పోనీ జానకిని ఆ యింట్లోంచి తీసుకుపోతే! తిరిగి ఎవరికైనా యిచ్చి పెళ్ళిచేస్తే! ఎవరు చేసుకుంటారు. పోనీ తానే చేసు కుంటే? వాళ్ళ ధనం, కారు, ప్రజలు, పోలీసులు జ్ఞాపకం వచ్చేరు భానుమూర్తికి. అతని కళ్ళల్లోంచి నీరు స్రవి స్తోంది. తన జీవితమంతా త్యాగం చేసైనా ఆమెకి సాయం చెయ్యాలనుకున్నాడు.

మర్నాడు భానుమూర్తి లేచీలేవగానే చిదానందం గది లోకి వచ్చేడు. పాపం, ఏవేవో సౌజ్ఞలతో తెలియజేసేడు. టిఫినుకి పైకిరమ్మని తీసుకువెళ్ళేడు. అక్కడ భాను మూర్తి, చిదానందం, జానకి ముగ్గురూ కలిసి తిన్నారు. ఆతర్వాత తాను పెట్టిన నగలూ, బట్టలూ చూపమన్నాడు భార్యని. జానకి భర్త ఆజ్ఞను పాలించింది. భానుమూర్తి వాటిని చూస్తున్నాడేగాని అవన్నీ అతని దృష్టిలో నిర్జీ వంగా వెలవెల బాయతున్నాయి. అయినా వాళ్ళకి సంతృప్తి కలిగించాలని బాగున్నాయంటున్నాడు. ఇంతలో దేనికో చిదానందం క్రిందికి వెళ్ళిన సమయంచూసి "జానకీ, మీకు మీనాన్న తీరని అపచారం చేసేడు" అన్నాడు. "ఊరుకో బావా ఎవరేనా వింటారు. ఇదంతా ఘటన ఎవరేంజెస్తారు?" అంది ఆమె.

"నిన్ను చూస్తే నాకేదో బెంగగావుంది. ఆరు నెలలలో ఆరవై ఏళ్ళదానిలా అయిపోయావు." అన్నాడు బావ.

"ఎల్లకాలం ఒకలాగుంటామా బావా" అంది జానకి చీరలు మడుచుకుంటూ.

"నిన్నరాత్రంతా నిన్నుగురించే ఆలోచించేను, "నీకెల్లా గైనా సుఖం కలిగించగలనా అని" అన్నాడు బావ.

"పోనీలెద్దూ అయిపోయిన విషయాలు తలచి ఏం లాభం? ఇంకేమైనా మాట్లాడు" అంది జానికి అమాయ కంగా. ఇంతలో చిదానందం తిరిగి వచ్చేడు. తానూ జానకీ కలిసి తీయించుకున్న ఫొటోచూపెట్టేడు. ఫొటోలో మాత్రం జంట చాలాబాగుంది. ఆరోజంతా భానుమూర్తిని అంటిపెట్టుకునే వున్నాడు చిదానందం. అతన్ని చూస్తే కూడా భానుమూర్తికి జాలికలిగింది.

ఆరాత్రి భోజనం చేసి తిరుగు ప్రయాణానికి సిద్ధ మయ్యేడు భానుమూర్తి, కారు వచ్చి వీధిలో నిలబడింది. చిదానందం అతని అన్నా క్రింద వున్నారు. భానుమూర్తి జానికితో చెప్పాలని పైకి వెళ్ళేడు. ఆమె ఒక్కతే బిక్కు బిక్కు మంటూ బాల్కనీలో నిలబడివుంది.

"నే వెళ్ళి వస్తా జానకీ" అన్నాడతడు.

"దయమాత్రం వుంచు" అంది మరదలు.

"ఎంతమాట! నా పంచప్రాణాలూ నీమీదేవున్నాయి" అన్నాడు బావ.

జానకి కళ్ళంట నీళ్ళు గిర్రున తిరిగి రెండు చేతులా మొహం మూసుకుంది. అది చూసి అతనికీ ఏడుపు వచ్చింది. అయినా నిగ్రహించుకుని "తప్పమ్మా! ఏడవకు నీకెప్పుడు కష్టం తోచినా నాకు రాయి. మీ అక్క వొకటి నేనొకటీ కాదు రెక్కలు కట్టుకు వాలుతాను." అంటూ క్రిందికి దిగివెళ్ళేడు. అన్నదమ్ములిద్దరితోచెప్పి వీధిగుమ్మం దిగుతూండగా అతని కోటుమీద రెండు నీటి బిందువులు పడ్డాయి. పైకి చూస్తే మూడో అంతస్థులోనుంచి ఎవరో క్రిందికి తొంగి చూస్తున్నారు. 'జానకి గాక మరెవరు' అనుకుంటూ కారులో కూర్చున్నాడు భానుమూర్తి.

రైలు కదిలింది. భానుమూర్తి తల కిటికీ వూచలికి ఆనించి కూర్చున్నాడు. బయటనుంచి చల్లగాలి తగిలి మత్తెక్కిస్తోంది. ఏవేవో బెంగలు, విచారాలూ అతని మెదడులో క్రిక్కిరిసిపోయాయి. జానకి భర్త మూగివాడని తన మామగాని, ఆఖరికి తన భార్యగాని ఎన్నడూ రాయ లేదు. ఆమె ఎన్నిసార్లు రాసినా "జానకి అదృష్టవంతు రాలు. వండెడు నగలు, పెట్టెడు బటలూ దానికేంలోటు" అంటూనే రాసింది. బహుశా ఏ బలహీనపు ఘడియల్లోనో తానే జానికైతే బాగుండుననిగూడా ఆమె యోచించి వుంటుంది. కాని తన విషయంలో మటుకు నిస్సందే హంగా చెప్పగలడు. వాళ్ళ భాగ్యానికి రెట్టింపు ధన మిచ్చినా తాను చిదానందాన్ని గావాలని ఎన్నడూ కోరడు. ఆయింట్లో కావలసినంత స్థలమూ, సామానూ, కారూ, నౌకర్లూ, వంటవాళ్ళూ వున్నమాట వాస్తవమే. కాని, జానకి ఏమాత్రం సుఖపడడం లేదన్నమాట కూడా వాస్తవం. అది తాను సులభంగా అర్థం చేసుకోగలడు. ఇక అతనికి అర్థంకానిదల్లా ఒకటే. అనుదినం మనోవ్య థతో కూరుకుపోయి ఎడారి కుసుమంగా హరించిపోతున్న జానకి జీవితాన్ని ఆనందమయమనిపిలిచే లోకం గ్రుడ్డిది గాక మూగిది కూడానా? ఏమీతోచక బయటికి తొంగి చూసేడు. భూమి తెల్లుపు నలుపుగా వెనక్కి పరుగెత్తు తోంది. భానుమూర్తి కొంచెం ఆలోచించి "ఈ భూమి నిజంగా వెనక్కి పరుగెత్తుతోందా నా భ్రమగాని" అను కున్నాడు. ఇంతలో "జానకి సుఖపడుతోందని ప్రపంచం కూడా ఇల్లాగే భ్రమిస్తోంది కాబోలు" అని సమాధానం చెప్పుకున్నాడు. ★

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

——:o:——

* శ్రీమతి కె. యం. సౌందర్యవల్లి *

[ శ్రీమతి కె. యం. సౌందర్యవల్లిగారు రచించిన కీర్తనలను స్వరరాగములతో ప్రచురింపనెంచినారమని వెనుకటి సంచికలో ప్రకటించితిమి. ఆరంభములో, త్యాగసేవాసక్త, శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మ గారు యీ కీర్తనలనుగూర్చి వ్రాసిన అభిప్రాయమును ప్రకటించుచున్నాము —సం॥]

"శ్రీమతి సౌభాగ్యవతి. కె. యం. సౌందర్యవల్లి దేవి గారు రచించిన శ్రీ త్యాగరాజగురుకీర్తనలు- భక్తి, రక్తి, విరక్తి, రాజయోగమును- బోధించు చక్కని రాజమార్గ ముగా యున్నవి. అదియుగాక తన స్వాంత సుఖముల కొఱకో, అష్టైశ్వర్యముల నిమ్మనియో- ఇహసంబంధము లను గురించియో స్తుతిచేయక- శ్రీ సద్గురు శ్రీ త్యాగరాజ పరబ్రహ్మమువారి శ్రీరామతారక నామమహిమలు- వారు శ్రీరాములవారితో ఆనందముగా అనుభవించిన ముచ్చ టలు, వారు చూపిన నవవిధభక్తి, నాద సుధారస అమృత పానముచే, చెందిన తన్మయత్వములను స్తుతిం చుచూ, వారు లోకోద్ధరణార్థము అవతరించిన నాదరూప, నాదలోలుండైన త్యాగరాజేయని- స్తోత్రము జెసి యుం డుట కీర్తనల అర్థమెరిగి చదువువారికి, రాగమెరిగి భజన చేయువారికి, బాగుగా తెలియగలవు, దెలుసును. ఈ భాగ్యము అనంత జన్మాంతర సుకృత పరిపాకమువలన ఈమెగారికి లభించినది. వీటివలన వీరి అనన్య భక్తిశ్రద్ధలు సంగీతజ్ఞానము గోచర మవుతున్నది- గాక మనభక్త స్త్రీ లోకమునకె, ఇదియొక గొప్పయనుట అతిశయోక్తిగాదు. ఈమెగారు భర్త పుత్రపుత్రి, ప్రపుత్ర, సపరివార సహిత ముగా- చిరాయురారోగ్యైశ్వర్యములతో భక్తులై -గానకలా సేవ కులై- దేశసేవ చేయుదురుగాతయని- శ్రీ సద్గురు స్వాములవారిని ధ్యానించి- భక్తితో విరమించెదను. అన్నియు శ్రీ సద్గురు త్యాగబ్రహ్మమువారి కరుణా కటాక్షము. దీనిని పఠించి, భజించువారికి భక్తి, ధ్యాన యోగము, పరలోక సాధనము కలుగును.

సర్వేజనాస్సుఖినోభవంతు. మంగళాని భవంతు.

బెంగుళూరు నాగరత్నమ్మ."

1. శ్రీరంజని రాగం — రూపకతాళం.

ఆరో॥ స రి గ మ ద ని స — అవ॥ స ని ద మ గ రి స

ప॥ పదాంబుజములనుగొల్వవె, మనసా ! శ్రీసద్గురు ॥ప॥

అ॥ ప॥ సదారామనామ మధురసుధారసము గ్రోలు ఘనుని ॥ప॥

చ॥ రాగలోభగుణదూరుని, రాగభావలయవేద్యుని
భాగవతాగ్రేసరుని, త్యాగరాజ నామధరుని ॥ప॥

| | O—2 | 1—4 | O—2 | 1—4 |
|---|---|---|---|---|
| ప॥ | నీ నీ | ; దా మా మా | గా గా | ద మ గా రీ సా |
| | ప దా | ం బు జ ము | ల ను | గొ . . ల్వ వె |
| | రీ గా | మా ; ; ; | మా ; | గా మా దా నీ |
| | మ న | సా . . . | శ్రీ | స . ద్గు రు |

| | O—2 | 1—4 | O—2 | 1—4 |
|---|---|---|---|---|
| ప॥ | సా స స | ని ద మా మా మా | గా గా | ద మ గా రీ సా |
| | ప దా . | ం బు జ ము | ల ను | గొ . . ల్వ వె |
| | రీ గా | మా ; ; ; | ని స ని ద | మా గ మా ద నీ ॥నీ॥ |
| | మ న | సా . . . | శ్రీ . . . | . స . ద్గురు ॥ప॥ |
| అ॥ప॥ | నీ సా | ; నీ నీ స | రీ ; | రీ రీ గా రీ |
| | స దా | . రా . మ | నా | మ మ ధు ర |
| | ని స రీ గ రి | సా రి రి స ని సా | రీ ; | రీ రీ గా రీ |
| | స . దా . . | . రా . . . మ | నా | మ మ ధు ర |
| | రి గ మా | గా రీ సా ; | దా నీ | సా రీ గా రీ ॥నీ॥ |
| | సు ధా . | ర స ము | గ్రో . | లు ఘ ను ని ॥ప॥ |
| చ॥ | ; మ గ | మా దా ; దా | దా దా | దా నీ సా ; |
| | రా . | గ లో భ | గు ణ | దూ రు ని |
| | ; నీ | దా మా ; మా | గా గా | ద మ గా రీ సా |
| | రా | గ భా వ | ల య | వే . . ద్యు ని |

అ. ప. మా ది రి

భాగవతాగ్రేసరుని, త్యాగరాజ నామ ధరుని

(ప దాం బు జ ము)



##  గొప్ప విషయం 

శ్రీ బి. వి. నరసింహారావు బి.ఏ. బి.ఇడి.

ఏది చాల గొప్పవిషయ
మెరుగ జెప్పు జగతిలోన?
—మాఘ మందు విరియు మల్లె?
మలయ మారుతంబు? లేక
మంచివాని చెలిమి? కాక
మరపురాని మంచి తలపు?
తీయనైన కలయ? పోని
హాయి గూర్చుతేనె పాట?
గర్వమెరుగ నట్టి కలిమి?
కనికరమును పొందులేమి?
కనుల చెదర నీని కాంతి?
కడు సహజపు లావణ్యము?
స్వేచ్ఛ నెరుగు నట్టి క్రమత?
స్వచ్ఛమైన మధుర వాక్కు?
మాతృ భక్తి? మంచి నడత?
దేశ భక్తి? ధైర్యగుణము?
త్యాగనిరతి? శాంతి? ప్రేమ?
సమత భావ మందరి యెడ?
మొగము మొత్త నట్టి తృప్తి?
మోసమెరుగ నట్టి స్వార్థ?
మెరుగజెప్పు ఏది ఘనము
ఏర్పడగా జగతిలోన??
— ఒక్కటైతె కాదు ఇందు
ఒప్పుమీర ఘనమైనది.
అన్ని కలసియున్న జగము
అందము ఆధిక్య మందు.



# బాల వినోదం



## ★ మనసు లేని మెరుపు ★

శ్రీమతి లంక అమృతాంబ

ముద్దుముఖముల ముగుదల్లారా
పసిడి పలుకుల పాపల్లారా
కుసుమ కంఠముల కుర్రల్లారా
సావధానముగ వినుడీకథను.

కల్లకాదిదంతయు నిజమె
చూచిన దానిని చెప్పెదను
విన్నదానికి సానుభూతిగా
కన్నీరొకతరి వదలండి.

శెలవలలో సంబరముగను
మా ఊరికని నేబోతి
హాయిగకాలం మాతమ్ములతో
గడపుచుంటిని చల్లగను.

ఒకరోజున హాయిగ పాడుచు
నవ్వుచు ఎగురుచు మేమాడ
తెల్లటి మేఘం నల్లటి మబ్బుతో
నింగి అంతయు నిండింది.

సహజమే మేఘం వచ్చుట
మేఘముతోనె వచ్చు నురుములు
ఉరుములకెప్పుడు తోడు మెరపులు
మెరపులు చూచుట కింపుగదా !

అనుచును మేమాడుచునుండ
క్రమ్మెను మేఘము ఉర్వి అంతయు
కన్నులు మిరుమిట్లు గొల్పుచు
వచ్చెను మెరపులు వేగముగా.

బెదరిపోయి మేమందరము
ఇంటను దూరగ వేగిరమే
భూమిఅంతయు దద్దరిల్లగా
ఒక్క ఉరుము ఉరిమింది.

ప్రళయ రూపము పొందెను ప్రకృతి
నింగి అంతయు నెర్రనాయెను
వెండి తీగెవలె కాంతి అంతయు
నేలను తాకగ వేగిరపడెను.

చెట్టా పట్టా వేసుకుపోతూ
తండ్రీ కొడుకు మెరపును చూచిరి !
ఎవరికి వారు కళ్లు చెవులను
మూసుకు బెదరుచు నిల్చిపోయిరి.

మనిషని మ్రానని విచక్షణలేని
తండ్రని కొడుకని తేడాలేని
మెరపు పరుగుతో కొడుకుని తాకి
భూమిని దూసుకుపోయింది.

తనకేది దాపురించెనో
తన నేమి ఆవరించెనో
తను ఏమి చేయుచుండెనో
తెలియకపోయె నా బాలునకు.

అరచుట కవకాశమైనను
పిలుచుటకు పలుకైనను
నిలుచుటకు ప్రాణమైనను
లేక ఆ బాలుడు రూపు మాసెను.

# మనసు లేని మెరుపు

చక్కని మేనుకు మెచ్చిన రూపును
మంచి బుద్ధులు మించియుండిన
అంతటి దేహం అంతరించెగా
మనసు లేని ఆ మెరపువల్లను.

ప్రకృతి బలిగొన్న వెంటనే
ప్రళయ తాండవం మానింది
ప్రశాంతముగా ప్రపంచమంతా
సద్దుమణిగిపోయింది.

బాలుడు పడినచోట మండినమంట
మిన్నుముట్టినట్లయ్యింది.
బాలుడు లేమినిచూచిన తండ్రిదుఃఖము
మిన్ను కరిగినట్లయ్యింది.
ప్రకృతిఅంతా ఘోషించింది
వరుణుడు కొద్దిగ వర్షించాడు
మంటను మాత్రం ఆర్పుచు తండ్రి
మిగిలిన అస్థికలు జూచాడు.

దేవుళ్ళారా రారండి
మీమీ ప్రతిభలు చూపండి
మీమీ చల్లని చూపుల నొకతరి
నాపై స్రవింప జేయండి.
ఏమీ ఎరుగని బాలుడు వీనికి
కొద్ది ప్రాణం పోయండి
మీమీ మేలును నే నెప్పటికి
మరువలేనిది నిజమండి.

అని వగచుచు ఆ తండ్రి
అడవిరోదనం చేశాడు.

నల్గురు కూడిరి చూచిరి బూదిని
తల్లులు తండ్రులు శోకం చేసిరి
గడచిన దానికి వగచి కూడ
లాభం లేదని తెలిసి కూడ
కాయునక్కపై తాటిపండువలె
"బాలుడు ప్రాణ మెట్లు బాసెనని"
ప్రశ్నపై ప్రశ్న తండ్రికి వేసి
నల్గురు పంచాయితి చేశారు.

చేతికందెడి బాలుడు పోయెను
తనకు మరి దిక్కెవ్వరనుచు
ఖేదము పొందుచు ఆ తండ్రి
గడిపెను కాలము యంత్రము రీతి.

తల్లీ తండ్రీ యిత్తురు పుట్టుక
పుట్టిన వెనుక పోషించెదరు
పోషణచేసి పెంతురు దేహం
పెంచిన దేహమున కిత్తురు ధైర్యం

అంతయుచేసి ఆతనిపైన
జూపుదు రెక్కుడు ఆసక్తి
అట్టి ఆతడు అశువులుబాసిన
మూలము బెకలిన మహావృక్షముగ
కూలెద రెందరో కళవళపడుచు
ఇంతేగద ప్రపంచపుతీరు.

బాలుడు పడిన చోటునుచూచి
పెక్కురు పొందుదురో విశేషం
ఆతని ఆనవాళ్ళ నెందరో జూచి
మెడలను వంచి కన్నీరుకార్చి
నిముషం మాత్రం నిశ్శబ్దతతో
తరలిపోవుచుందురిప్పటికీ.

శాంతముగానె స్వర్గములోన
పుణ్యఫలముల ననుభవించుచు
ఆనందంబును పొందుచును
అమరజీవియాయె నా బాలుడు.

ఎక్కువ జీవం జీవిస్తేను
చూతురు ప్రాపంచిక కష్టములు
పుణ్యాత్మునకు బ్రతుకు తక్కువ
ప్రాపంచిక దుఃఖం పొందడాతడు
బ్రతుకు అతనికి స్వప్నమాత్రమె
దేవుని గలసిన ఆతని తలచుక
గానము చేసితి నింతకాలము
సానుభూతిగా ఆతని కొరకై
కన్నీరొకతరి వదలండి.





# ‘స సే మి రా’

కె. నరసింహమూర్తి



విశాలనగరమును నందుడను దర్మ ప్రభువు పరిపాలించుచుండెను. అతడు తన భుజబలముచే ఎన్నో రాజ్యములను జయించెను. దేవేంద్రునకు బృహస్పతివలె, ఆరాజుకు శారదానందనుడను మంత్రి గలడు. శారదానందనుడు తెలివైనవాడైనను, కర్మవశాత్తున అతడు రాజుగారి దయకు దూరమై, నిజరాజ్యమునుండి వెళ్ళగొట్టబడెను. కానీ రాజుగారి సైన్యాధిపతి, మంత్రిని చూచి జాలిపడి తన ఇంటిలో దాచెను. అతడు తిరిగి రాజుగారి అనుగ్రహమును పొందుటకు సమయము కొరకు వేచియుండెను.

ఇది ఇట్లుండ, ఒకనాడు రాజకుమారుడగు చంద్రసేనుడు వినోదముగా వేటకు వెళ్ళెను. అతడు ఎన్నో మృగములను చంపుచు తన సైన్యమునకు దూరమై, ఒక కారడవిలో చిక్కుకొనెను. అతడు సుకుమారుడగుటచేత చాలా అలసిపోయి ఒక చెట్టు క్రింద విశ్రమించుచుండెను. ఇంతలో ఎచ్చటనుండియో ఒక పెద్దపులి గాండ్రు, గాండ్రుమని వచ్చుచుండెను. రాజపుత్రుడు భయపడి అచ్చటనున్న కొమ్మను పట్టుకొని చెట్టు ఎక్కెను. కానీ దైవవశాత్తున ఆ చెట్టుపై ఇదివరకే ఒక ఎలుగుబంటి యుండెను. రాజకుమారుడా జంతువులను చూచి భయపడుచుండగా ఎలుగుబంటి వానిని చూచి “రాజకుమారా! భయపడకు. నీవు నన్ను శరణు జొచ్చితివి. కావున నిన్ను నేను రక్షించెదను. నేను నీకు హానిచేయను అని పలికెను. అప్పుడు రాజకుమారుడు ధైర్యము పొంది చెట్టు ఎక్కెను. చాల ప్రొద్దుపోవుటయు, రాజపుత్రుడు అలసియుండుటయు, గమనించి ఎలుగుబంటి అతనితో “నాయనా! నీకు నిద్ర వచ్చుచున్నదిగాబోలు. నాతొడలపై పడుకొనుము” అనెను. రాజపుత్రుడు సంతోషించి నిదుర పోవుచుండెను.

ఆసమయములోపులి ఎలుగుని చూచి“ఓ భల్లూకరాజా! మన జంతువులకు శత్రువగు ఆ మానవుని క్రిందకు పడద్రోయుము. వానిని తిని నేను వెళ్ళిపోయెదను. నరునితో మనకు స్నేహమేల!” అనెను. అందుకు భల్లూకము “ఓ శార్దూలమా! వీడు శత్రువైనను నన్ను శరణు కోరినవాడు. శరణాగతులను మోసము చేయువారు ఘోర నరకమును పొందెదరు. నన్ను క్షమింపుము” అనెను.

ఇంతలో రాజపుత్రుడు నిద్ర నుండి లేవగానే భల్లూకము అతనితో "ఓయీ! నేను కొంతసేపు నీతొడపై విశ్రమించెదను” అని పలికి పరుండెను. అది గమనించి పులి అతనితో “ఓయీ, ఈభల్లూకము టక్కరి జంతువు. నేను వెళ్ళిపోయిన తర్వాత ఇది నిన్ను భక్షించును. కావున నీవు దీనిని వెంటనే క్రిందకు త్రోయుము. నేను దీనిని భక్షించి వెడలి పోయెదను” అని పలికెను విశ్వాసహీనుడై ఆ రాజకుమారుడు తన్ను కాపాడిన భల్లూకముపై దయచూపక పులిమాటలు నమ్మి ఆ భల్లూకమును క్రిందకు త్రోసెను. అదృష్ట వశాత్తు ఆ ఎలుగుబంటి తక్షణము మేలుకొని పడిపోవుచు ఒక కొమ్మను పట్టుకొని మరల చెట్టెక్కెను. ఆ ఎలుగుబంటి బెదురుచున్న అతనిని చూచి “ఓరీ! నీచా! నీ నరజాతియొక్క నీచబుద్ధిని వెల్లడించావు. ఇట్టి నీచకార్యమునకు పూనితివికాన నీవు వెఱ్ఱివాడవై ‘ససేమిరా’ అని పలుకుచు నీపురమునకు పొమ్ము. దీని అర్థమును చెప్పు వాడు నీకు శాపవిముక్తి చేయగలడు.” అని పలికి పులి లేకుండుట చూచి వెళ్ళిపోయెను.

రాజకుమారుడు భల్లూక శాపమూలముగా ‘ససేమిరా’ అని అరచుచు అడవిలో తిరుగుచుండెను. పుత్రుని కొరకు రాజు తన భటులతో ఆ అడవిలో వెతుకుకొనుచు ఒక చోట పిచ్చివానివలె తిరుగుచున్న తన పుత్రుడైన చంద్రసే

నుని చూచెను. రాజు సంతసించి తన పుత్రుని కౌగలించుకొని ఎన్నో ప్రశ్నలు అడిగెను. కానీ ఆ రాజపుత్రుడు అన్నిటికిని "ససేమిరా" అని సమాధాన మిచ్చుచుండెను. రాజు విచారముతో ఆ ఉన్మాదపుత్రుని తన నగరమునకు తీసుకొని పోయెను. నాటినుండి ఆ రాజుఎంతోమంటి భూత వైద్యులను, వైద్యశాస్త్ర వేత్తలను పిలిపించెను. కానీ రాజపుత్రుని ఉన్మాదము తగ్గలేదు. మహారాజు తన పుత్రుని స్థితిని తలచుకొని దుఃఖించుచు తన పుత్రుని ఉన్మాదమును బాగుచేయువారికి కావలసిన బహుమతులు ఇచ్చెదనని చాటించెను.

ఇట్లుకొన్ని రోజులు గడచిన తరువాత ఒక సన్యాసి రాజసభకు వచ్చెను. రాజును చూచి "రాజా: నీహృదయ బాధను నేను గ్రహించితిని. నీతనయుని ఇటు తీసుకు రమ్ము. అతని బాధను నివారణ చేయుటకు ప్రయత్నించెద" ననెను. రాజు సంతోషించి తన తనయుని తీసుకొని వచ్చెను. సన్యాసి ఇంతలో కొన్ని ముగ్గులనువేసి, హోమ గుండమును ప్రతిష్ఠించెను. రాజకుమారుని ముగ్గులలో కూర్చుండబెట్టి సన్యాసి ఇట్లు అనెను.

"సద్గుణ శీలురను హింసించి నీ పౌరుషమును పోగొట్టు కున్నావు" ఈమాటలు వినగానే రాజపుత్రుడు "స"వదలి 'సేమిరా' అనుటప్రారంభించెను.

ఆ తర్వాత సన్యాసి, "సేతువును దర్శించిన పాపవిమోచన మగును. మిత్ర ద్రోహికి మాత్రము పుణ్య లోకము లభించదు," అనెను.

ఆ మాటలు వినగానే రాజపుత్రుడు 'ససే' వదలి'మిరా' అనెను. ఆ తర్వాత సన్యాసి 'మిత్రద్రోహికి, కృతఘ్నునకు,- విశ్వాసఘాతకునకు రౌరవాది నరకములు తప్పవు' అనెను.

ఆమాటలు వినగానే రాజపుత్రుడు 'రా' అనెను. ఆతర్వాత సన్యాసి "రాజా: నీ పుత్రుడు చేసిన నీచకార్య పరిహారార్థము బ్రాహ్మణులకు దానములిచ్చి దేవతలను ఆరాధింపుము."

ఆమాటలు వినగానే రాజపుత్రుడు వెంటనే ఆరోగ్యవంతుడై సావధానుడయ్యెను. తండ్రికి భల్లూక వృత్తాంతమును తెల్పెను. రాజు ఆ తర్వాత ఆ సన్యాసిని కౌగలించుకొనుచుండ, ఆ సన్యాసి తన వేషమును తీసివైచెను. ఆసన్యాసియే శారదానందనుడు. రాజు అతనికి నమస్కరించి, తన తప్పును క్షమింపుమని ప్రార్థించి, అతనిని యథావిధిగా గౌరవించి, తన మంత్రిగా నియమించెను.





# ఐక్యరాజ్యసమితి స్త్రీల ప్రతిపత్తి సంఘసమావేశం



ప్రపంచంలో స్త్రీలకు పురుషులతోబాటు సమానావకాశాలు లభించేటట్లు చేయడం విషయంలో జరిగిన అభివృద్ధిని సమీక్షించడానికి గాను న్యూయార్క్ నగరంలోని ఐక్యరాజ్య సమితి కేంద్ర కార్యాలయంలో 18 దేశాల ప్రతినిధులు సమావేశ మైనారు.

స్త్రీల ప్రతిపత్తి సంఘపు ఏడవ సమావేశమిది. ఈ సమావేశం మూడు వారాలపాటు జరుగుతుంది. స్త్రీల రాజకీయ హక్కుల సమస్య ఈ సమావేశపు చర్చనీయాంశాలలో ప్రధానమైనది. ఈ సంఘంవారు ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీకి తమ నివేదికను సమర్పించడానికి పూర్వం ఈ విషయంపైన చాలా సమావేశాలలో పరిశీలనలు జరిపారు. జనరల్ అసెంబ్లీవారు ఈ నివేదికలో కొన్ని మార్పులు చేసారు. ఐనప్పటికీ, జనరల్ అసెంబ్లీవారు దరిమిలా ఆమోదించిన ఒడంబడిక ముసాయిదాకు ఈ నివేదికే ప్రాతిపదికగా ఉన్నది. జనరల్ అసెంబ్లీ సమావేశాంతాన ఈ ఒడంబడికపైన వివిధ దేశాలవారు సంతకాలు చేస్తారు. తమ దేశాలలోని స్త్రీలకు పురుషులతోపాటు ఎన్నికల విషయంలోను, ప్రభుత్వోద్యోగాల విషయంలోను సమాన ప్రతిపత్తి కలిగి ఉండేటట్లు ఇలా సంతకాలు చేసిన దేశాలవారు చూడవలసి ఉంటుంది.

ఇతరులను ఎన్నుకొనే విషయంలోను, తాము ఎన్నికయే విషయంలోను స్త్రీలకు గల హక్కుల పట్ల వివిధ దేశాలలో ఇటీవల వచ్చిన మార్పులను గురించి ఐక్యరాజ్య సమితి సెక్రటరీ జనరల్ ట్రిగ్విలీ సమర్పించిన నివేదిక ఒకటి స్త్రీల ప్రతిపత్తి సంఘంవారి పరిశీలనకు సిద్ధంగా ఉన్నది. రాష్ట్రప్రభుత్వ పదవులకు, న్యాయశాఖ పదవులకు, కేంద్ర ప్రభుత్వ పదవులకు, తదితర పదవులకు జరిగే ఎన్నికలలో ప్రపంచంలో ప్రతి దేశంలోని స్త్రీలు ఎలా పాల్గొంటున్నారో ఈ నివేదికలో తెలియజేయబడింది.

ఇంతవరకు జరిగిన అభివృద్ధి: స్త్రీలకు పురుషులతోపాటు సమాన ప్రతిపత్తి ఉండాలనే ఉద్యమం 18 వ॥ శతాబ్దంలో ప్రారంభమయింది. అప్పటినుంచీ ఈ విషయంలో జరిగిన అభివృద్ధిని ఈ నివేదిక వివరిస్తున్నది.

ఐక్యరాజ్య సమితి ప్రణాళిక ఆమోదం పొందడంతో స్త్రీల ప్రతిపత్తిని పెంపొందించడానికి జరుగుతున్న కృషి అత్యంత ఉన్నతస్థాయి నందుకున్నది. స్త్రీలకు పురుషులతో సమాన ప్రతిపత్తి సమకూర్చాలనే విషయంలో ఈ ప్రణాళిక అత్యంత సమగ్ర మైనది.

సమితి ప్రణాళికలోని ఉపోద్ఘాతం: అన్ని దేశాలలోని మానవుల ప్రాథమిక హక్కుల పట్లను, వ్యక్తిగౌరవం పట్లను, స్త్రీ పురుషసమానప్రతిపత్తి పట్లను విశ్వాసాన్ని మరొకమారు ప్రకటించడానికి ఐక్యరాజ్యాల ప్రజలు నిశ్చయించు కున్నారు అని సమితి ప్రణాళిక ఉపోద్ఘాతంలో ఉద్ఘాటించ బడి ఉన్నది. స్త్రీ. పురుష వివక్షత, జాతి, భాష, మత వివక్షత, పాటించకుండా మానవ హక్కుల పట్లను, ప్రాథమిక స్వాతంత్ర్యాలపట్లను గౌరవాన్ని పెంపొందింప చేయడం సమితి నిర్మాణోద్దేశాలలో ఒకటని కూడా ఈ ప్రణాళికలోఉన్నది.

ఈ ఉత్తరువు కారణంగా, 1946 వ సంవత్సరారంభంలో లండనులో జరిగిన ఐక్యరాజ్య సమితి ఆర్థిక, సాంఘిక సంఘ ప్రాథమిక సమావేశంవారు స్త్రీల ప్రతిపత్తి విషయమై ఒక ఉపసంఘాన్ని ఏర్పాటు చేశారు. మానవ హక్కుల సంఘానికి ఈ ఉపసంఘం సలహాలిస్తూ ఉండాలని నిర్ణయించారు. కాని ఈ విషయానికి గల ప్రాధాన్యం కారణంగా స్వయంసంపూర్ణమైన ఒక ఉపసంఘాన్ని ఏర్పాటు చేయడం సముచితమని సమితి ఆర్థిక సాంఘిక సంఘంవారు నిర్ణయించారు.

ఉపసంఘ స్థాపనోద్దేశాలివి: వయోజన వోటింగు హక్కు, ఎన్నిక కావడానికి, ప్రభుత్వోద్యోగాలు నిర్వహించడానికి, స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కు, వివాహం విషయంలోను, పిల్లల పోషణ విషయంలోను, ఆస్తి సంక్రమణ విషయంలోను, ఆస్తి నిర్వహణ విషయంలోను, వారసత్వాల విషయంలోను, స్త్రీలకు పురుషులతో సమానప్రతిపత్తి, స్త్రీలకు వ్యతిరేకంగా ఆర్థిక, సాంఘిక వివక్షతా నిర్మూలన, పడుపువృత్తి నిర్మూలన, గర్భిణీ స్త్రీలకు ప్రత్యేక సదుపాయాలు, భీమా సదుపాయాలు, వృత్తివిద్యలలో సమానావకాశాలు.

ఈ ఆశయాలలో చాలాభాగం ఆచరణలోనికి రాలేదు. కాని, స్త్రీల హక్కుల విషయంలో కృషిచేస్తున్న వారికి ప్రోత్సాహం లభించతగ్గంత అభివృద్ధి మాత్రం ఈ ఆశయాల విషయంలో జరిగింది.



చిన్నకథ:

# "నాదే పొరపాటు"

శ్రీమతి బి. సుశీల

" శాంతా ! శాంతా !"

బయటనుండి కేక వినిపించింది. చేతిలోవున్న బట్టలు కిందపెట్టి కంగారుగా బయలుదేరింది.

" శాంతా !............"

అని ఏదో చెప్పబోయి ఆగిపోయింది శాంత తల్లి కమలమ్మగారు. గుమ్మందగ్గిర ఆగి తల్లివైపు ప్రశ్నార్థకంగా చూచింది శాంత.

"కబురమ్మా"

"ఏమిటని?" చికాకుగా వెనక్కు వచ్చింది శాంత.

"ఏమీలేదమ్మా"

"ఏమీలేనిదాని కెందుకు పిలిచావమ్మా"

ఎలాచెప్పాలో ఏంచెప్పాలో తెలియక తన స్థితికి తానే నవ్వుకుంది కమలమ్మగారు.

" యిద్దరూ అలానుంచున్నారేం శాంతా?".... అంటూ లోపలికి వచ్చాడు ప్రసాదు.

"ఏమీలేదు. అమ్మ ఏమో చెపుతానని ఏమీ చెప్పకుండా నిలబెట్టింది." అని చికాకుపడింది శాంత.

"ఏమీ లేదు నువ్వు వెళ్ళు" అని కమలమ్మగారు వాళ్ళు వెళ్ళినవైపు చూస్తూ నిలబడి నిట్టూర్చింది.

* * *

తండ్రిలేని పిల్ల శాంతకి కష్టపడి చదువుచెప్పించింది తను. డబ్బుంటేమాత్రం మొగదక్షత లేని ఆడది ఎన్ని కష్టాలుకోర్చుకోవాలి. ప్రతి చిన్న విషయానికీ యితరులపై ఆధారపడాలి. యీడువచ్చిన పిల్ల. పెళ్ళి ఎలా చేయటం? పెళ్ళి చేయకుండా ఎన్నాళ్ళిలా చదువుచెప్పిస్తూ తన దగ్గర పెట్టుకోగలదు? ఆడపిల్ల ఎప్పటికయినా అత్తవారింటికి వెళ్ళవలసిందేకదా? శాంతను పంపి తను ఒక్కతె ఎలా ఉండడం? ఏంచేయడం? యింతకూ శాంతకు సంబంధం చూచేవారెవరు? ఆప్రసాదే చేసుకుంటాడేమో? ప్రసాదు జ్ఞాపకం రాగానే కమలమ్మగారికి మనస్సులో తుపాను రేగింది. అతనెలాగూ చేసుకోడు. ఒకవేళ అతను వప్పుకున్నా మేనరికం వదులుకోడానికి ఏమయినాసరే వప్పదు ఇంజనీరుగారి భార్య. ఆవిడ ఎన్నోసార్లు చెప్పింది తనతో తన మేనకోడలు పెద్దదయిందనీ, పెళ్ళిచేయమనీ ప్రసాదు మేనత్త మేనమామలు త్వరపడుతున్నారని. ఇంక ఆసంబంధం ఆశించకంలో అర్థంలేదుకాని లోకులేమనకుంటున్నారు? శాంతను గురించి తన చెవినిబడ్డ మాటలు గుర్తుకు వచ్చేసరికి వళ్లు జలదరించింది. యింక శాంతకు పెళ్ళయే విధానమేలా? అంతా శూన్యంగా తోచిందావిడకు. అంతా తనదేతప్పు. తనెందుకు కేకలెయ్యలేదు శాంతను? ముందుగానే వాళ్ళ స్నేహం విషయంలో కలగజేసుకొని శాంతను అదుపులో పెట్టుకోకపోవడం తప్పెవరిది? ఎన్నోసార్లనుకుంది శాంతను కేకలెయ్యాలని. చిన్ననాటి వాళ్ళ స్నేహాన్ని, చదువునీ ఎక్కడ ఆపాలో ఎప్పుడు అదుపులో పెట్టాలో అర్థంకాలేదావిడకు. ఇప్పుడు తనేం చేస్తే ఏం ప్రయోజనం? లోకులనోరు మూయగలదా? యీరోజునుండి అతనితో బయటకు పోవద్దని శాంతతో గట్టిగా చెప్పాలని ప్రయత్నం చేసింది. ప్రొద్దుట నుండి దానికి ఫలితంగా తనే వెళ్ళమని శాంతను బయటకు పంపింది. ఊరికే దానినేమని తిట్టడం? అతనిని ఎందుకని శాంతతో మాట్లాడవద్దని శాసించడం? ఏతప్పూ లేనిదానికి తను వాళ్ళనెలా వేరు చేయడం? యీసమస్యతో ఆవిడ మనస్సు సుళ్లు తిరిగింది. కొంచెంసేపు అనుకుంది శాంతే కొడుకైఉంటే! ఒక్కక్షణం శాంతను కొడుకనుకొని కలలు కంది. మరుక్షణమే వాస్తవికం జ్ఞాపకంవచ్చి ఉలిక్కిపడింది.

బయట శాంతగొంతు వినిపిస్తోంది. బరువుగా లేచి వంటయింట్లోకి వెళ్ళిపోయింది కమలమ్మగారు.

* * *

మధ్యాహ్నం భోజనాలయినాక భాగవతం చేతులో పెట్టుకొని మండువాలో కూర్చుని కునుకుపాట్లు

పడుతోంది కమలమ్మగారు. శాంత చేతితో కలంపట్టుకుని వ్రాస్తున్నది.

"పెసాదం బాబెళ్ళిపోయాక బెంగో ఏమో శాంతమ్మ గారు బొత్తిగా సిక్కిపోనారు." అని దాసీది అన్నమాటలు గుర్తుకొచ్చి ఉలిక్కిపడి లేచింది కమలమ్మగారు. తన కూతురు గొడవ మధ్య ఊరివాళ్ళకెందుకో? వాళ్ళ అన్నం వాళ్లు తిని వాళ్ళ పంచని వాళ్ళు కూర్చున్నా వాళ్ళసంగతులన్నీ ఉన్నవీ లేనివీ యిరుగింటి ఎల్లమ్మ. పొరుగింటి పుల్లమ్మ కుళాయిదగ్గర చెప్పుకోవడం మానరెందుకో? తాముగంజి త్రాగితే వాళ్ళకేం. పాలు త్రాగితే వాళ్ళకేం? ఆరుస్తారా? తీరుస్తారా? యీ ఆలోచన ఎలాముగించాలో తెలియక భాగవతం చదవడమారంభించిందావిడ. వీధిలో పోస్టుకేక విని పరుగెత్తిన శాంత గుమ్మంలో నుంచే కేక వేసింది.

"అమ్మా! ప్రసాదు ఉత్తరం రాశాడే! పదిరోజులలో శలవులకు వస్తున్నాడట."

వుత్తరం పుచ్చుకొని జాగ్రత్తగా చదివింది కమలమ్మ గారు. అందులో తనకేమీ తప్పు కనిపించలేదు. అయినా సరే యికమీదటయినా శాంతను అదుపులో పెట్టాలనుకొంది. ఎలాచెప్పడమనేది అర్థంకాలేదు మళ్ళీ తనకు.

ఉత్తరం భాగవతంలోపెట్టి కళ్ళజోడు పదిలంగా కింద పెడుతూ అంది.

"శాంతా యికమీదట నువ్వు అతనితో తిరగటానికి వీలులేదు. ఉత్తరాలు రాయకు."

ఏమీ అర్థంకాక నిర్ఘాంతపోయింది శాంత. తనేమన్నదీ తనకే అర్థంకాలేదు. ఆవిడ అయినా ఏదో అనేసింది యిక ఆగి లాభంలేదు అందువల్ల సాంతం చెప్పింది.

శాంత వెక్కి వెక్కి ఏడ్వడం మొదలుపెట్టింది. అది చూచి తను చాలా బాధపడింది. దీనికి జడిసే యింత కాలం మెదలకుండా ఊరుకుంది.

"శాంతా యిటుచూడు. నీతప్పుఉందనలేదే నేనూ. అబ్బా, నిండు యింట్లో ఏడ్పుకూడదమ్మా, నాతల్లివి కదూ? యిటుచూడు. ఛీ! ఏడవకే నీతప్పు వుందనలేదు గానేను. మనబట్ట మనం కట్టుకుని మన బొట్టు మనం పెట్టుకున్నా లోకులకు వెరవాలమ్మా, నీకు తెలియదు. చిన్నదానివి. చెప్పకపోతే ఎలాతెలుస్తుందిచెప్పు? చెపితే యింత అల్లరిపడితే నేను మాత్రం ఏం చెప్పగలనమ్మా!" అని బ్రతిమాలింది.

పదిరోజులనుండి శాంతకు ఏమీ తోచలేదు. ఒక్కటే ఆలోచన. ప్రసాదువచ్చి మామూలుగా పలకరిస్తే తనేం చేయాలీ అని.

ఆరోజున శాంతకు అసలు మతే లేదు. అస్తమానం అదే ఆలోచన. అతనితో బయటకు రానంటం ఎలా? తను పలకకపోతే అతనేమనుకుంటాడు? అమ్మ ఎంత బాధపడిచెప్పిందో యీసంగతి తనకు. తనెప్పుడూ పెళ్ళిని గురించి ఆలోచించనేలేదు. అసలు అమ్మ చెప్పేదాకా తనకు తెలియనేలేదు తన స్నేహం ఒక పెద్ద సమస్యగా మారిందని. ప్రసాదును తను ప్రేమిస్తున్నానా అనుకొంది. లేదు.... .... .... లేదు.... .... .... ....

ప్రేమిస్తున్నాను. కాని తనెప్పుడూ పెళ్ళివిషయం ఆలోచించలేదే. ప్రసాదును తను పెళ్లాడటమా? తనెప్పుడూ ఆలోచించలేదీసంగతి. అతనేమనుకుంటున్నాడు. ఏమో. తన దగ్గర ఎప్పుడూ ఏమీ అనలేదు. ఎన్నాళ్ళగానో అతను వస్తాడని ఎదురుచూసింది. యిప్పుడు వెయ్యి దేవుళ్ళకు మొక్కుకుంటోంది అతను రావటం మానిపించమని. అది తప్ప మరో మార్గం కనపడలేదు శాంతకు.

ప్రసాదు గొంతు ప్రక్కగదిలోంచి వినపడేసరికి ఉలిక్కిపడి పరుగెత్తింది పెరట్లోకి. వాకిలి తలుపు వేస్తామని వస్తూన్న కమలమ్మగారికి ప్రసాదు, మరొక యాభయ్యేళ్ల పెద్దమనిషి ఎదురయ్యారు. తర్వాత సంఘటన కలో నిజమో అర్థంకాలేదు ఆవిడకు కొంతవరకు.

శాంత ఏమంటుందో అని తను గదిలోకి వెళ్ళింది. శాంత తలవంచుకు కూర్చుంది. ప్రసాదు బల్లమీద కూర్చుని అంటున్నాడు:

"చూడు శాంతా! అతను చాలా బాగుంటాడు, అందానికి అందమూ ఉంది. తెలివైనవాడు. మంచివాడు. లేకపోతే నేనంతగా చెపుతానా. నామాటంటే నమ్మకంలేదూ! నీతో ఎప్పుడయినా అబద్ధం చెప్పేనా! యిటుచూడు శాంతా---

శాంత తల మరికొంచెం వంచి కొంగు వేలికి చుడుతోంది.

"నీవు మెదలకుండా ఊరుకుంటే నీమనస్సులోని సంగతి నాకెలాతెలుస్తుంది? నీకిష్టం లేకపోతే చెప్పు. నాదగరకూడా సిగ్గయితే బ్రతికేదెలా శాంతా?" అని ఎంతో జాలిగా అన్నాడతను.

"నీ యిష్టం" అంది శాంత.

"నాయిష్టం బాగానే ఉంది. నీకు యిష్టమేనా" అని.

తల వూపింది శాంత.

"అమ్మయ్య! యజ్ఞం అంత పనిచేశావు" అని నవ్వాడు. ఒక్కక్షణం తన్నితాను మరచిపోయి తల పైకెత్తి ఆతన్నిచూసి తనుకూడా నవ్వింది శాంత.

"ఏమన్నది అబ్బాయి" అంది గుమ్మంలోంచే కమలమ్మగారు. తల్లిగొంతు విని పెళ్ళి గుర్తుకొచ్చి సిగ్గుపడి తల వంచుకుంది శాంత.

"వప్పుకొందండీ, మీరు తాంబూలాలు పుచ్చుకోవడమే తరువాయి. కుర్రవాణ్ణి మీరు చూడాలంటే తప్ప"

"మేం చూడటమెందుకు నాయనా! నువ్వు చూస్తే చాలదూ! దానికి అన్నయినా తమ్ముడయినా నువ్వే" అంది కమలమ్మగారు.

"ఎందుకయినా మంచిది అబ్బాయిని తీసుకొనివస్తా సాయం కాలం 5 గంటలకు" అంటూ వెళ్ళిపోయాడు ప్రసాదు.

"ఏమమ్మా! ప్రసాదన్నయ్యనుగురించి ఏమనుకొన్నావు?"

"అవునమ్మా! నాదే పొరపాటు."



# ఉత్తరాల ఉపద్రవం

శ్రీ కాకర్లమూడి సీతారామస్వామి

వాకిట్లో వాలుకుర్చీలో పడుక్కుని చించిన కవరులోని చీటీ తీసి ఆతురతగా చదువుకో సాగింది. ఉత్తరం చివర కొచ్చే కొద్దీ ఆమె ఉత్సాహం ఉరకలు వేసింది. హృదయం ఉప్పొంగింది. 'నీప్రియ ప్రకాశం' అన్న ముక్కలు మాత్రం అనుకోకుండా పైకి చదివేసినది. ఒళ్ళో పడి ఉన్న కార్డూ, కవరూ ఆలానే ఉన్నై. చేతిలో ఉన్న ఉత్తరాన్నే రెండు, మూడు సార్లు చదువుకొన్నది. ఉత్తరాన్ని గుండెలకద్దుకొంటూ, కళ్ళు మూసుకొని వెనక్కి పడుక్కొని హృదయంలో యిష్ట దైవానికి నమస్కారాలు చేసింది. ఏదో ఆనందంలో ఆమె అలానే ఉండిపోయింది.

"ఏమేవ్ ! మఱదలు పిల్లీ! వంటయిపోయిందా ఏమిటి? ఎక్కడా చడీ చప్పుడూలేదు." అంది బిందె చంకనెట్టి కొని దొడ్డి గుమ్మంలోకి వచ్చిన సరోజిని. ఆ మాటలకు ఉలిక్కి పడిలేచి ఉత్తరం కుర్చీలో పడేసి జోరుగా వంటింటి తలుపు తీసికొని దొడ్డిగుమ్మంలోకి వచ్చింది. ఆనడకతో ఒళ్ళోని ఉత్తరాలు దారిలో జారిన సంగతి కూడా ఆమెకు తెలీదు.

"అదికాదు వదినా! పోష్టుమాన్ వస్తేనూ" అని యింకా చెప్పబోతుండగానే—

"మా తమ్ముడు వస్తున్నానని ఉత్తరం వ్రాసాడా ఏమిటి?" అని బుగ్గ మీద కొడుతూ ప్రశ్నించింది—

ప్రమీలాదేవి సిగ్గుతో 'ఔ'నని తల వూపింది. "అదే మిటే, కాపరాని కొచ్చి రెండేళ్ళాయె. అంతక్రితం కాలేజీలో రెండేళ్ళూ హాయిగా ఉంటిరాయె. ఇంకాసిగ్గేనా? సరే కాని యింకాఏమన్నా విశేషాలు? అంతా కులాసా?" అని ప్రశ్నించింది సరోజిని, బిందె ఎడం చేతిలోకి మారుస్తూ.

"లోపలికి రా వొదినా ! ఎండలోనే నిలబడ్డావ్. నీకే యిస్తాను. ఉత్తరం చదువుదువు గాని" అనిబిందె అందుకొని క్రింద బెట్టి, చేయిపట్టుకొని లోపలికి తీసి కెడుతూండగా.

"ఇవెక్కడినుంచే, ఈ కవరింకా చించనే లేదు. ఈ కార్డెవరు వ్రాసారు" అని క్రింద పడ్డ రెండు ఉత్తరాలు తీసి ప్రమీల చేతికందిచ్చింది. ఆ విషయం ప్రమీలకేమీ ఆశ్చర్యం కలిగించ లేదు. ఆ ఆనందోత్సవంలో ఆమె చేతిలోంచి అందుకొని, కుర్చిలోని చీటీ అందిస్తూ:

"కూర్చొని చదువు"

అని కుర్చీ వెనుకకు వచ్చి, ఆమె బుజాల మీద చేతు లానించి నిలబడ్డది. సరోజిని ఉత్తరం చదవబోతూ ఆగి: "అయితే ప్రమీలా! మొగుడు వ్రాసిన ఉత్తరాలు అందరి చేతికీ యిస్తారుటే" అని నవ్వుతూ వెనక్కిచూసింది.

"నువ్వు మరీనే. కాలేజీలో చదివేటప్పటికీ ఇప్పటికీ చాలా మారిపోయావు. చదువు, చదువు".

సరోజిని లో లోపల ఉత్తరమంతా చదువు కొన్నది. ఉత్తరములోని సంతోషజనక మయిన సంగతులకు తన ఆనందాన్ని వెలిబుచ్చి, బుగ్గ మీద వ్రేలితో కొడుతూ: "యింక మరదలు పిల్ల క్రింద నడవక్కర్లేదు" అంటూ వెళ్ళిపోయింది నవ్వుతూ.

ప్రమీలాదేవికి ఎక్కడ లేని సిగ్గూ ఆవరించింది. అద్దంలో ప్రతిఫలిస్తూన్న ఆమె నీలి కన్నులు పరిహసించి నట్లనిపించినవి. తన భర్త తనకు వ్రాసిన ఉత్తరం అందరికీ చూపటం అంత మంచిది కాదను కొన్నది. అయినా సరోజిని తనకు పరాయిదా ఏమిటి? అయిదేళ్ళు కలసి చదివినది. తన భర్త సరోజినిని ఎరగనివాడా? అందు చేత అదేమీ హాస్యాస్పదం కాదనుకొన్నది. అదీ కాక తనభర్త భవిష్యత్తును మనస్పూర్తిగా ఆశీర్వదించేవారిలో సరోజిని కూడా మొదటి తరగతిలోకే వస్తుంది. ఇలా ఏవేవో ఊహించుకుంటూ తిరిగి ఉత్తరం తీసి చదువుకో సాగినది.

"డియర్,

ఆశీర్వాదాలు—నాకు తెలుసు, నిన్ను ఒక్కత్తినీ విడచి యిన్నాళ్ళు తిరగటం నిన్ను చాలా బాధిస్తుందని. అయినా నేను తిరిగి వచ్చేలోగానే ఈ శుభవార్త నీకంద జేస్తున్నాను. ఈసారి ప్రయాణం వృధావ్యయం కాలేదు.

# ఉత్తరాల ఉపద్రవం

'నవభారతి' దిన పత్రికకు వారం వారం వ్రాసినందుకు నెలకు 60 రూపాయిలిస్తానన్నారు. 'ఉషోదయం' మాస పత్రికకు సీరియల్ నవల యిచ్చేటట్లయితే సంచికకు 20 రూపాయిలిస్తానన్నారు. 'విదుషి' 'గృహలక్ష్మి' అనేస్త్రీల మాస పత్రికలకు నువ్వు వ్రాస్తే దాని ద్వారా నెలకు పదిహేను రూపాయిలిస్తానన్నారు. ఇంతలో కొంత బైట పడ్డామనే భావించు. ఇక్కణ్ణుంచి మనం స్వర్గధామంలో బంగారు తూగుటూయెలలమీద ఊగలేకపోయినా ఎవరి దగ్గరా చెయ్యి జాచనక్కలేదు.

నాజీవితంలో సమభాగస్థురాలవుగా, నావర్తమాన భవిష్యత్తులో సహచరివిగా ఉన్న నువ్వుకూడా నాతో సమానంగా ఆనందిస్తావనుకుంటా. భవిష్యత్తు యింకా బావుంటుందనే ఆశావాదం మనకు దోహద మిస్తుంది. నీయిష్టదైవం 'వాణి'కి నానమస్కారాలు........"

ఏదో బ్రహ్మాండమయిన భారం ఆమె హృదయంలోంచి జారి పోయినట్లయింది. ఒక్కసారి చేతులు జోడించి ఎదురుగావున్న సరస్వతి విగ్రహానికి నమస్కరించింది. తమదాంపత్య సౌఖ్యం ప్రసాదించవలసినదిగా మనస్సులో ప్రార్థించింది. అలానే కాస్సేపుకూర్చున్నది. అప్పటికి జ్ఞాపకం వచ్చింది, మిగిలిన ఉత్తరాలమాట.

తన అజ్ఞానానికి తనే నవ్వుకుంటూ కార్డు తీసి చదివింది. ఎవరో అపరిచితులు వ్రాసినట్లేఉంది. ఏమిటో ఆయన వ్యాసాలు గూర్చి ప్రశంసించాడు. రెండోకవరు చించింది. మెల్లిగా కాగితం తీసి చదువుకోసాగింది.

"దేవీ, ముద్దులు—

ఈఉత్తరము వ్రాయకూడదనుకుంటూ వ్రాస్తున్నా. నీకూ, నాకూ మధ్య ఎన్నిమైళ్ళు దూరముంది అని ఆలోచించుకొంటే చాలా బాధగా ఉంది. ఎక్కడో మారుమూల పల్లె పట్నం. కాని ఇంట్లో నువ్వు ఏకాకివిగా నాకోసం కళ్ళు కాయలు కాచేట్లు చూస్తూకూచుంటావ్.

కాని—

జనసమ్మర్ధమయిన పట్నంలో ఓచివర ఆసుపత్రిలోమంచంమీద నేను నీగురించే ఆలోచిస్తున్నాను. మరేం భయపడకు. నువ్వుపుత్త అమాయకురాలవు ప్రమీలా! అదిగో. అప్పుడే కంటతడి పెట్టుతున్నావ్. జీవితంలో ఎప్పుడూ ఒకేలాగా ఉంటామా! అంత చదువు చదివినా, అన్ని కథలువ్రాసినా నువ్వు బేలగా అయిపోతే ఏలా!

ఏదీ ఒక్కసారి నువ్వు నవ్వితే ఈ సమయంలో నాకెంతో తృప్తి కలుగుతుంది. బాధంతా తీరిపోతుంది. నవ్వావు కదూ నా కోసం. పెద్దభయపడవలసిన ప్రమాదమేమీ లేదు. పాపం! కొత్తగా కారునడపటం నేర్చుకుంటూన్న ఒక అమ్మాయి పొరపాటున సైకిలుమీద వస్తూండగా డేష్ యిచ్చింది. చుట్టపెట్టుకుపడ్డాను. కొద్దిగా దెబ్బలు తగిలాయి. అయినా పెద్ద గాయాలేమీ పడకుండా కారు ఆపుచేయగలిగింది అమ్మాయి. గబగబా క్రిందకుదిగివచ్చి ఎంతో దీనంగా;

"మానాన్నగారు డాక్టరే. నేను మందు వేయిస్తాను రండి. పొరపాటు ఎవరికన్నా వస్తుంది. క్షమించండి. మీకు నయమయేవరకూ మాహాస్పిటల్‌లో వుండవొచ్చు." అని తీసికెళ్ళింది. ఆ అమ్మాయి ఎంతమంచిదనుకున్నావ్. వయస్సులో పెద్దదే అయినా చెల్లాయీ అని పిలుస్తాను. ఆమె అన్నయ్యా అంటూ వచ్చి పండిచ్చి వెళ్తుంది. డాక్టరుగారు సహజంగా హృదయంలేని వాడయినా నా విషయంలో మాత్రం శ్రద్ధవహిస్తున్నాడు. రెండు, మూడు రోజులలోనే నేను తేరుకోవచ్చు. మళ్ళీ త్వరలోనే జవాబువ్రాస్తా—

నీకు తోచకపోతే సరోజిని అక్కయ్యతో కాలక్షేపం చెయ్యి. ఆమెకు బాగా తెలుసు ప్రపంచం— ఏదీ మరొక్కసారి నవ్వు— వెయ్యి ముద్దులు— నీ.........."

అని చదవటం ముగించింది. ఆమెకీ ప్రపంచమే అంధకారబంధురమయినట్లు కనిపించింది. ఏమిటీ పరస్పర విరుద్ధంగా ఉత్తరాలు. ఆశ—నిరాశ. ఇదేనా మిగిలేది. ఆయన ఆరోగ్యం ఎలాఉన్నదో! ఒక ఉత్తరానికీ ఇంకో ఉత్తరానికీ సామరస్యంలేదు. ఆమె కన్నులు తెరచేవున్నా ఏమీ కనపట్టంలేదు. సజీవమయినా అచేతనమయింది. ఉత్తరంచదువుకొంటూమాత్రం రెండుసార్లునవ్వింది. తన భర్త ఆజ్ఞాపాలనో? కాక ఆయన ఆనందంకోసమో— అలా అచేతనంగా రెండు మూడు నిమిషాలు పడుకొని ఉత్తరం చేత్తోపట్టుకొని లేచి దొడ్డిగుమ్మంలోకి వెళ్ళి నెమ్మదిగా సరోజినిని పిలిచింది. ఆయింటికీ ఈ యింటికీ బాహాటంగా వస్తూ పోతూ ఉండటానికి మార్గం ఉంచేసి అడ్డగోడ కట్టారు. ఆ మార్గంగుండా సరోజిని వచ్చింది. వస్తూనే ప్రమీలాదేవి ముఖంలోని విచారరేఖల్ని, కను

రెప్పల అంచులనున్న తడిని పసికట్టి, ఆతురతతో,

"ఏమే అలా ఉన్నావ్?"

అంది లాలనగా సమీపించి—ప్రమీల పెదిమ కదప కుండా ఉత్తరం చేతికిచ్చి గడపను జేరబడి నిలుచున్నది. సరోజిని ఆ వేగంతో ఉత్తరం సమగ్రంగా చదివి కృత్రిమ మందహాసంతో:

"అయ్యో, పిచ్చిదాన ఈపాటిదానికే యింత యిదవు తారుటే. కాక డాక్టరుగారింట్లోనే మకామాయె. రెండు మూడు రోజుల్లో రానేవస్తాడు. నడు, నడు. అన్నం తిన్నావా యింతకీ" అని నెమ్మదిగా వంటిట్లోకి తీసుకొచ్చి ఆరిపోయిన పొయ్యిలో మాడిన పోపు గరిటెచూచి.

"అదేమిటే ఈవిడ్డూరం. అబ్బెబ్బె, నువ్వు మరీ పసి పిల్లవవుతున్నావే! చాల్చాలు, ఎవరన్నా చూస్తే నవ్విపోతా రనన్నా ఉండాలి. ఉండు. ఇవాళ్టికి నేనుకాస్త కూరా, పచ్చడీ యిస్తాను—పోనీలే! అన్నం ఎలానూ ఉడికింది కనుక అగిన్నె అక్కడికే పట్టుకెళ్ళి కలిసి తిందాం. ఆయ నెలానూ యింట్లో లేరు, రా రా" అని మరోసారి ఉత్తరం వయిపు చూస్తూ ఆలోచించసాగింది.

"అదికాదే! ఏమిటీ ఉత్తరాల వరస. ఏవో పత్రికలు- కాంట్రాక్టులు- మళ్ళీ గాయాలు- జ్వరం. రెండూ ఒక్క రోజునే. అందులో ఈ గొడవలేదు, ఇందులో ఆవిషయం లేదు. పోనీ అంటే 'రైటింగ్' ఆయనదే అని ప్రత్యక్షరాల తెలుస్తోంది" అని ఆగింది.

ప్రమీలాదేవి కన్నులలోని తడి ఆరనేలేదు. ఆమె గొంతు గద్గదంగానే పలుకుతున్నది. ముఖంలో విషాద చ్ఛాయలు విస్తరిస్తూనే ఉన్నవి. సరోజిని రెండు క్షణాలు అలానే నిలబడి ఆలోచించి రెండో ఉత్తరం తీసికొచ్చి చూసింది. ఆమె ముఖంలో ఈసారి ఒక ఆశారేఖ వెల్లి విరిసింది. చిరునవ్వు చిందులాడింది.

"ఓస్, మరదలు పిల్లా! ఇదిగో ఇదివ్రాసివారమయింది. అంటే వెళ్ళిన మరునాడే హాస్పటల్ లో చేరాడు. తరువాయి పనులన్నీఅయ్యాక ఆవిషయాన్నే మరిచిపోయి ఆనందంలో యిది వ్రాసాడు. మా తమ్ముడికి మరుపెక్కువని నీకు తెలియదూ?"

అని బుగ్గమీద చిటికినవేలుతో కొట్టింది. రెండుఉత్తరాలు పుచ్చుకొని చూచింది. అప్పటికి సంతృప్తి కలిగింది. ఉత్త రాలు నెలలు తరబడి ఆలస్యంగా వస్తూండడం పత్రికలలో చదివినట్టు గుర్తుకు రాగానే సంతృప్తి వహించింది. అయినా ఆయన ఆరోగ్యం పూర్తిగా బాగయిందో? అని కూడా భయపడ్డది,

రెండో ఉత్తరంలో ఆయన ఆరోగ్యాన్ని గూర్చి వివ రించకపోయినా అనారోగ్య ప్రస్తావన లేకపోవడం శుభ సూచకమేనని తృప్తిపడ్డది.



## మేలుకొల్పు

శ్రీ పి. రామజోగారావు

ఉదయించుచుండెనదుగో బాలభానుడు ఉదయాద్రినుండి
తరలి
కనుపించుచుండెనదిగో పొట్టిశ్రీరాముని ఆనందభాష్పసరళి
కదలుచుండెనదిగో ఆంధ్రరాష్ట్ర దిగ్విజయ రథావళి.
మేలుకొనవమ్మ ఇంకనీబిడ్డల మేలుకొల్పతెనుగుతల్లీ.

మరచిపోవుచున్నారు నీపూర్వమహితశక్తి
గుర్తుచేయవమ్మనీసవతి బిడ్డలపైనిఅనురక్తి
అవగాహనచేయవమ్మ నీబిడ్డలసహనశక్తి
చాటుకోవమ్మబిడ్డలకు నీయందలిమాతృభక్తి
ఉప్పొంగుచుండె నీబిడ్డలఉడుకురక్తమ్ము
అందుకొననమ్మ ఆంధ్రమహిళల మంగళహారతులు
ఆశీర్వదించవమ్మ నీఅమృతహస్తములతోడ
తిరిగిఒకసారిదిద్దుకోవమ్మ బిడ్డలతెనుగుతల్లీ.

యుగంధరునివంటి ప్రకాశము నీముందరుండె
తిక్కనవంటి ఖేదలి నీప్రక్కనుండె
కాచుకొనిఉన్నారెందరెందరో నీయాజ్ఞలందుకొనగ
ఏలుకోవమ్మ నీఅఖిలాంధ్ర సామ్రాజ్యము.

ఆంధ్రమ్ములోపల్కు అమృతంపు పలుకు.
ఆంధ్రకృపాణపు అంచులచురుకు
ఆంధ్రభూములలోని ఆదర్శంపుపైరు
తెలుపుకోగదమ్మ ప్రపంచమెల్ల తెలిసికొనగ.

కనుపించుచున్నదదిగో ఆంధ్రుల జయపతాకమ్ము
వినుపించుచున్నదదిగో ఆంధ్రుల వీరపతాకమ్ము
నడిపించుచున్నదదిగో ఆంధ్రుల బుద్ధిబలము.
మేలుకోగదమ్మ బిడ్డల మన్ననలందుకొనగ తెనుగుతల్లీ



---

# ఆంధ్ర మహిళా సభ నృత్యశాఖ

## పిల్లల నృత్యం

ఈ శాఖలో శాస్త్రయుక్తమైన తంజావూరు భరతనాట్యము నేర్పబడుచున్నది.

జూనియర్—సీనియర్ తరగతులలో 3 సంవత్సరముల పరిమితిలో
భరతనాట్యము సంపూర్ణముగా నేర్పబడును.

ప్రవేశ రుసుము—రూ. 2—0—0
సభ్యత్వ రుసుముతో కలిపి

జూనియర్ తరగతికి రూ. 6-0-0 .... సీనియర్ తరగతికి రూ. 9-0-0

నృత్యోపాధ్యాయిని:
శ్రీమతి ఎస్. సామ్రాజ్యలక్ష్మిగారు.

---

# ఆంధ్ర మహిళా సభ

## సంగీతశాఖ

ఈ శాఖలో గాత్రము, వీణ వాయిద్యము నేర్పబడుచున్నది.

క్లాసులు సాయంకాలం 4 గంటలనుండి 7 గంటలవరకు

ప్రవేశ రుసుము—రూ. 2—0—0
సభ్యత్వ రుసుముతో కలిపి

వీణ జూనియర్ శాఖకి రూ. 8-0-0 .... వీణ సీనియర్ శాఖకి రూ. 13-0-0

గాత్రం జూనియర్ శాఖకి రూ. 7-0-0 .... గాత్రం సీనియర్ శాఖకి రూ. 11-0-0

సంగీతోపాధ్యాయిని:
శ్రీమతి జె. సుబ్బలక్ష్మిగారు.

## అంతరాత్మ

(28 వ పేజీనుండి)

న్నావు. నువ్వు ఎంత స్వార్థపరురాలివి? చచ్చిపోయి నువ్వు సాధించేదేమిటి? బ్రతికుండి అమ్మకీ, నాన్నకీ వొచ్చే కష్టాలని ఎదుర్కొని, సుఖమో, దుఃఖమో వాళ్ళతో సమానంగా అనుభవించు. జీవితమనే మహాసముద్రంలో నువ్వు కొట్టుకుపోతున్నావు. అది ఎంత దూరం తీసుకెళితే అంత దూరం పో. వెనక్కి తిరిగావా, అది నీ పిరికితనాన్ని చాటుతుంది. నీలాగ ఆత్మహత్య చేసుకోవటం మొదలిడితే ఈ భూమిమీద ఒక్కరూ మిగలరు. నీకు జీవితంమీద విరక్తి కలగటం వైరాగ్యంవల్లకాదు. నిన్ను ఎదుర్కొనే సమస్యలనీ, కష్టాలనీ, ఓర్చుకునే సహనశక్తి నీలో క్షీణించింది, రోజు లాకలాగే వుండవు" అని ఆ పిల్ల ముగించింది.

ఆమాటలు వింటుంటే తల తిరిగిపోయింది. ఆ పిల్ల మాటలు ఎంతవరకు నిజం? ఎప్పటికయినా మంచిరోజు లొస్తాయేమో? నాన్నకి దగ్గు ఎలావుందో? అనుకుంటూ మళ్ళీ కిటికీలోంచి అవతలికి చూసింది. అదే ఆకాశం, అవే నక్షత్రాలు! మీనాక్షిని వెక్కిరిస్తున్నాయి. ఈ సారి మళ్ళీ మీనాక్షి ఎదురు బెంచీవైపు చూసేటప్పటికి ఆ పిల్ల లేదు.



## శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు

(12 వ పేజీనుండి)

ఖరగ్పూరులలో రాష్ట్రేతరాంధ్రుల సభలలో పాల్గొని మన్ననలందినది. సారస్వత చర్చలే గాక, రాజకీయ సభా చర్చలలో గూడ పాల్గొనినది. ఉపన్యాసములందు చర్చలందు తమయభిప్రాయములను క్రమానుబద్ధముగను, సహేతుకముగను, వ్యక్తపఱచి, సభాసదుల నుత్సాహపూరితులను జేసి, వారి అభివందనములను పొంద గలిగిన శక్తి యీమెకు మెండు.

పాండిత్యము, రచనా సామర్థ్యం, ఉభయభాషలలో అసమానమైన వాగ్ధాటి గలిగి, సారస్వతములో ఉన్నతమైన ఒక స్థాయి నందుకున్న యీమె స్త్రీలోకమున కంతయు గర్వ కారణమైన విదుషీమణియని చెప్పక తీరదు. గృహలక్ష్మీ కంకణ గృహీత గౌరవమును పొందుటకు ఈమె సర్వవిధముల ఒప్పి యున్నదని చెప్పక తప్పదు.



## ఆంధ్ర మహిళాసభ

### మాతా శిశు సంరక్షణశాఖ, ఉచిత వైద్యశాఖ

ఉచిత వైద్యశాఖలో విజయదశమి నాటినుండి కార్యక్రమము ప్రారంభమైనదని 'ఆంధ్ర మహిళ' చదువరులకు తెలిసినవిషయమే. ప్రతిదినము రమారమి 30 మంది బీదవారు యీ వైద్యశాలలో డాక్టరుచే పరీక్షించబడి, వ్యాధినివారణకై మందులను తీసుకొనుచున్నారు.

ఏప్రిల్ 15-వ తేదీ ప్రాంతమునుండి, యిచట ప్రసూతి, రోగిసంరక్షణ శాఖలు ప్రారంభమగును.

సహృదయులందఱూ మా యీ కార్యక్రమమునకు చాయశక్తుల సహాయమొనర్చి ప్రోత్సహించవలెనని మనవిచేయుచున్నాము.

కార్యదర్శిని.

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

**మహిళా విద్యాలయము** : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు, నృత్యము, గానము.

**పారిశ్రామిక విద్యాలయము** (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.

**వస్త్రములపై అద్దకపుపని** : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభలో నడుపబడుచున్నది.

**టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్** : స్త్రీలకు టైపు, షార్టుహాండు—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ.

**మహిళా మందిరము** : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

**ఆంధ్ర మహిళ** : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

**నిర్మలాదేవి గ్రంథాలయము** : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము ఏర్పరచిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

**నర్సింగ్ హోమ్** : స్త్రీ, శిశువుల, సంరక్షణకొరకు ఉచిత వైద్యశాల— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్సుఎయిడ్—మంత్రసాని పనులతో శిక్షణకు ఏర్పాట్లు జరుగనున్నవి.

**ముద్రణశాల** : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును.

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

Regd. No. 4759



Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 14, Dwaraka, Mylapore, Madras 4